విజయసాధనకు మార్గదర్శి '999' అనే తారక మంత్రమే !






ఓవర్‌లాక్ మిషన్లు



ఎరువుల మూటలు
కుట్టు మిషన్లు

ఇవేగాక

**గురు**

ఓవర్‌లాక్ మిషన్లు

**శివా**

కుట్టుమిషన్లు
మోటర్లు

వివరాలకు :

ఫోన్ : 22698, 27876

సంప్రదించండి

పంపిణీదారులు

## జయగజలక్ష్మి మెషినరీస్

2/156, బ్రాడ్వే (పై మేడమీద), మద్రాసు-600 001

అన్ని చోట్లా డీలర్లు కావలెను



# వనిత



"వనిత కాలక్షేపానికి పనికొచ్చే పత్రిక కాదు – అది విజ్ఞాన విశేషాలు చెబుతుంది; గొప్ప వారి జీవిత కథలు వివరిస్తుంది; కుట్లు పన్లు, అల్లికలూ నేర్పుతుంది; ఆహార నియమాలు చెబుతుంది; కొత్త కొత్త వంటలు తెలియజేస్తుంది; ఇలాగే ఇంకా ఎన్నెన్నో చెబుతుంది. అందుకనే వరస తప్పకుండా నేను 'వనిత' చదువుతూ వుంటాను" అంటున్న లక్షలాది పాఠకులకు –



## నూతన సంవత్సర శుభాకాంక్షలు

జనవరి ఒకటో తేదీగల సంచిక 'సౌందర్య విశేష సంచిక'గా చర్మ, శరీర, ముఖ సౌందర్యాలకు సంబంధించిన వివిధ విషయాలు, వ్యాసాలతో వచ్చింది....

ఇప్పుడు వస్తున్న నరేష నవల ''రాధ''తో పాటు-మరొక చిన్న నవల
''కాంతి కిరణాలు'' ఆరంభమైంది...



ఈ కొత్త సంవత్సరంలో 'వనిత'—

మీరు మెచ్చే మరికొన్ని కొత్త శీర్షికలు ఆరంభించబోతున్నది....



విడి ప్రతి: ఒక రూపాయి; సం.ర చందా: రూ. 24లు

మీ మంచి అలవాట్లలో మరొక మంచి అలవాటు 'వనిత' ప్రతి సంచికా చదవడం!

వనిత: చందమామ బిల్డింగ్స్: మద్రాసు 600026

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

నవంబరు 76 సంచిక చందమామలోని ''కథా శీర్షిక పోటీ'' పాఠకులను అమితంగా ఆకర్షించింది. చందమామ పోటీలలో పాల్గొనేవారు కార్డులను మాత్రమే ఉపయోగించాలి. కవర్లు వగైరాలు చూడబడవు. కథా శీర్షిక పోటీలలో పాల్గొనేవారు కథ రాయనవసరం లేదు; తమ పేరూ, చిరునామా, కథకు మంచి పేరూ రాస్తే చాలు. కొందరు 4, 5 పేర్లు రాశారు. ఇది తప్పు. ఏది మంచిదో పోటీదార్లే నిర్ణయించుకుని ఒక పేరే పంపాలి.

ఈనెల బేతాళకథ [''రాచకొలువు''] గంగిశెట్టి శివకుమార్ రచన.

సంపుటి 60    జనవరి '77    సంచిక 1

విడి ప్రతి : 1-25    : :    సంవత్సర చందా : 15-00






CHITRA




అనభిజ్ఞాయ శాస్త్రార్థాన్
పురుషాః పశుబుద్ధయః
ప్రాగల్భ్యా ద్వక్తు మిచ్ఛంతి
మంత్రే ష్వభ్యంతరీకృతాః. 1

[శాస్త్రార్థాలు తెలియకుండానే పశుప్రాయులైన వాళ్ళు సమాలోచన సభలో జొరబడి ప్రగల్భాలాడతారు.]

అశాస్త్రవిదుషాం తేషాం
న కార్య మహితం వచః,
అర్థశాస్త్రా నభిజ్ఞానాం
విపులాం శ్రియ మిచ్ఛతాం. 2

[ఇలాటి శాస్త్రవిమూఢుల మాటలు కీడు చేస్తాయి. ఎక్కువైన మేలు కోరేవారు వాటిని వినిపించుకో రాదు.]

అహితం చ హితాకారం
దార్ష్ట్యా జ్జల్పంతి యేనరాః
అపేక్ష్య మంత్రబాహ్యా స్తే
కర్తవ్యాః కృత్యదూషణాః. 3

[ఎవరైతే తమ ప్రగల్భాలతో అహితమైన దాన్ని హితమైన దానిలాగే చెబుతారో వారిని ముందుగానే పరీక్షించి, మంత్రాలోచన నుంచి బహిష్కరించాలి.]

కుమంత్రులు



## 43

కాకి, తాబేలూ, ఎలుకా–ఈ ముగ్గురు మిత్రులూ సరస్సు తీరాన సుఖంగా జీవిస్తూవచ్చారు.

ఒకనాడు ముగ్గురూ గోష్ఠి జరుపుతూండగా అక్కడికి చిత్రాంగమనే దుప్పి, వేటగాళ్ళు తరుముకొస్తున్నట్టుగా పరిగెత్తుకుంటూ సరస్సులో వచ్చి పడింది. దాని వెనకగా వేటగాళ్ళు వస్తున్నారేమోనని భయపడి తాబేలు నీటిలోకి దూకింది. ఎలుక బిలంలోకి వెళ్ళింది; కాకి సమీపంలో ఉన్న చెట్టు మీదికి ఎగిరింది.

కాని ఎంతసేపటికీ ఎవరూ వస్తున్న జాడ కాకికి కనిపించలేదు. దుప్పి ఆబగా నీళ్ళు తాగటం చూసి, అది తన మిత్రులైన తాబేలునూ, ఎలుకనూ పిలిచి, "వేటగాళ్ళు ఎవరూ దుప్పిని తరమలేదు. అది అమితమైన దాహంకొద్దీ పరిగెత్తుకుంటూ వచ్చింది. మనం నిష్కారణంగా భయపడ్డాం." అన్నది.

దానికి మంథరకం (తాబేలు,) "మిత్రమా, నువు పొరబడ్డావు. వేటగాళ్ళు తరిమినట్టు దాని ముఖం చూస్తేనే తెలుస్తున్నది. అంత వేగంగా పరిగెత్తుకొస్తూ కూడా అది వెనక్కు తిరిగి మళ్ళీ, మళ్ళీ చూసింది. దాని గుండె అమిత వేగంగా కొట్టుకున్నది. ప్రాణభయంకొద్దీ పారిపోయేవారిలోనే అలాటి లక్షణాలు కనిపిస్తాయి. అచ్చుగా దాహమే అయితే అంత శరవేగంతో రావలసిన పనిలేదు," అని, చిత్రాంగం కేసి తిరిగి, "మిత్రమా, నేనన్నది నిజమేనా?" అని అడిగింది.

దానికి చిత్రాంగం, "మంథరకా, నా భయానికి కారణం సరిగా గ్రహించావు. అనేకమంది వేటగాళ్ళు నన్ను

అట్ట చివరి బొమ్మ

తరిమారు. వాళ్ళ బాణాలు వెంట్రుక వాసిలో తప్పిపోయాయి. ఆ దుర్మార్గులు నా మందనంతటినీ చంపేశారు. నేను మీ శరణుకోరుతున్నాను. నన్ను ఇక్కడ ఉండనిచ్చి, కాపాడండి,'' అన్నది.

''ఓ దుప్పీ, నువు ఇక్కడే ఉండి పోయి, మా కున్నదానిలో భాగం పంచు కోవటానికి ఎలాటి అభ్యంతరమూ లేదు. శత్రువుల నుంచి తప్పించుకోవాలంటే పిక్కబలమో, భుజబలమో ఉండాలి. వేటగాళ్ళు వచ్చి పడకముందే మనం త్వరగా దట్టమైన కారడవిలోకి పోదాం,'' అన్నది తాబేలు.

చెట్టు మీది నుంచి చూస్తున్న కాకి, ''వేటగాళ్ళు వాళ్ళ శిబిరానికి వెళ్ళి పోతున్నారు. ప్రస్తుతానికి భయంలేదు. మనం ఈ పెద్దచెట్టు చల్లనినీడన సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చు,'' అన్నది.

కాకితోనూ, తాబేలుతోనూ, ఎలుకతోనూ మైత్రి నెరపాలన్న కోరికను చిత్రాంగం (దుప్పి) వ్యక్తం చేసింది.

''మేం బొత్తిగా అల్పప్రాణులం కదా, మా మైత్రి నీకు ఎలా ఉపకరిస్తుంది? రక్షణ కోరేవారు బలవంతులైన మిత్రులను గదా కోరాలి?'' అని మంథరకం అడిగింది.

''మిత్రులు అత్యల్పులయినప్పటికీ గొప్పవారికి సైతం ఎంతో సహాయం చెయ్యవచ్చు. ఏనుగులను విడిపించిన ఎలుకల కథ అదేగదా!'' అన్నదీ దుప్పి.



ఆ కథ ఏమిటని మంథరకం అడగగా, చిత్రాంగం ఇలా చెప్పింది:

"ఏనుగులను విడిపించిన ఎలుకలు"

ఒక అరణ్యంలో ఒక శిథిలాలయం ఉండేది. దానిముందు ఒక గొప్ప కోనేరు ఉండేది. ఆలయ శిథిలాలలో లక్షల కొద్దీ ఎలుకలు సుఖంగా ఉంటున్నాయి.

ఒకసారి నీటి కరువు రాగా ఒక ఏనుగుల రాజు తన మందతో నీటిని వెతుక్కుంటూ శిథిల్కాలయం ముందు ఉన్న కోనేరుకు వచ్చింది. ఏనుగులు ఆలయ శిథిలాల మధ్యగా వస్తూ అనేక ఎలుకలను తొక్కేశాయి. ఎలుకలు సమావేశం జరిపి, తమకు ఏర్పడిన ప్రాణభయం గురించి చర్చించుకుని, ఏనుగుల రాజు వద్దకు రాయబారం పంపి, "మా పట్ల భూతదయ చూపండి. ఎంత క్షుద్ర ప్రాణులమైనా మా వల్ల మీకు ప్రయోజనం ఉండవచ్చు," అన్నాయి.

ఏనుగుల రాజు ఈ మాటకు నవ్వి కూడా ఎలుకల కోరికను మన్నించింది. ఏనుగులు శిథిలాల మధ్యగా నడవటం మానేసి, కోనేటి వద్దకు చుట్టు తిరిగి పోతూ వచ్చాయి.

అక్కడికి సమీపంలో ఉన్న ఒక రాజు ఏనుగుల ఆచూకీ తెలిసి, నీటిలో ఏనుగులను పట్టే ఏర్పాట్లు చేయించాడు. నీటిలో వేసిన ఉచ్చులు చూడక ఏనుగులు అనేకం చిక్కుపడిపోయాయి. ఏనుగుల రాజు ఎలుకల వాగ్దానం జ్ఞాపకం పెట్టుకుని, బంధంలో చిక్కుకోని ఆడఏనుగును ఎలుకల వద్దకు పంపింది. ఎలుకలు వచ్చి ఏనుగుల దీనస్థితి చూసి, వాడి అయిన తమ పళ్ళతో ఏనుగుల బంధాలను కొరికేసి, వాటికి విముక్తి కలిగించాయి.

ఏనుగుల రాజు తన అనుచరులతో, "స్నేహం చెయ్యండి, స్నేహం చెయ్యండి! ఎంత దుర్బలులైన మిత్రులు సైతం ఆపదలో ఆదుకోవచ్చు! ఈ సంగతి ఎలుకలు ప్రత్యక్షంగా నిరూపించాయి." అని చెప్పింది.



# 181. అతి ప్రాచీన వృక్షం

ఆరిజోనా రాష్ట్రంలో అనేక కోట్ల సంవత్సరాల క్రితం అరణ్యాలుండేవి. అందులో మహావృక్షాలుండేవి. కాలక్రమాన అవి శిలీభూతమై, ఫాసిల్ రూపం ధరించాయి. అహల్యను శిల కమ్మని గౌతముడు శపించాడు. కాని కాలం ప్రాణం ఉన్న ప్రతిదానినీ శిలగా మార్చగలదు. అలా శిల అయిపోయిన మహావృక్షం బొమ్మలో కనిపిస్తుంది.





# మాయాసరోవరం

## 13

[కొండ చెరువులో మునిగిన జలగ్రహాన్ని, మకరకేతు కొండ మీది జలాశయంలోకి తీసుకుపోయి, అక్కడ జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ వదిలి, జలగ్రహంతోపాటు నీట మునిగాడు. జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలపాతంలో చిక్కుకుని, దిగువకు పడ్డారు. స్పృహకోల్పోయిన సిద్ధసాధకుణ్ణి, పులి ఒకటి సమీపిస్తూండగా జయశీలుడు అక్కడికి వెళ్లాడు. తరవాత-]

పులి నుంచి సిద్ధసాధకుడికి రానున్న ప్రమాదాన్ని గుర్తించి, జయశీలుడు వేగంగా పరిగెత్తుతూ, పులి తన ముందు కాళ్ళతో సాధకుడి తలను కొట్టబోయే సమయానికి, దాని దృష్టిని మరల్చేందుకు, ''హెూయ్!'' అంటూ పెద్దగా అరిచి, సమయానికి చేతికందిన ఒక చిన్న రాయిని తీసుకుని దానిమీదికి గురిగా విసిరాడు.

ఆ సమయంలో జయశీలుడు యింకా పులికి ఇరవై ముప్పై అడుగుల దూరంలో వున్నాడు. మనిషి కేకతోపాటు, రాయి వచ్చి శరీరానికి తగలగానే పులి చప్పున తలతిప్పి వెనక్కు చూసింది. అదే అవనుగా జయశీలుడు వేగంగా ముందుకు పరిగెత్తి, అందుబాటులో వున్న పులి వెనక కాళ్ళను పట్టుకుని గుంజాడు. పులి ముందు కాళ్ళ మీద లేవబోయి,



పట్టు దొరకక, కోపంతో భీకరంగా గాండ్రించింది.

అప్పటివరకూ స్పృహలేకుండా పడి వున్న సిద్ధసాధకుడు తృళ్ళిపడి తల ఎత్తి, పులి కంటబడగానే, "జై, మహాకాళా!" అంటూ అలవాటు ప్రకారం శూలం ఎత్తబోయాడు. కాని, శూలం చేతిలో లేకపోవటంతో, భయంకొద్దీ వెనక్కుపోబోయి నీటిలోపడ్డాడు.

ఈ లోపల జయశీలుడు, అది వెనక కాళ్ళు రెండూ విరిగిన పులి అని గ్రహించి, దాని విరిగిన కాళ్ళు పట్టుకుని దూరంగా లాగి, సిద్ధసాధకుడితో, "సాధకా! నీ దృష్టికి పులి తప్ప, దాని వెనకనే వున్న నేను కనిపించినట్టు లేదే!" అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే సాధకుడు నీళ్ళల్లో లేచి నిలబడి, "జయశీలా, నువ్వు యిక్కడే వున్నావా? జలపాతం నుంచి కిందపడటం వరకు తెలుసు; ఆ తరవాత ఏం జరిగిందీ నాకు తెలియదు. పులి అరుపుతో నాకు ప్రాణం తిరిగొచ్చింది," అన్నాడు.

"ఎలాగైతేనేం, ఇద్దరం ప్రాణాలతో వున్నాం," అని జయశీలుడు తల తిప్పి, దూరంగా నేల మీద పొర్లుతూ, చిన్నగా అరుస్తున్న పులి కేసి చూసి, "పాపం, జలపాతంలోంచి రాళ్ళ మీద పడి యీ పులి రెండు కాళ్ళూ విరగ్గొట్టుకున్నది. ఇక దీనికి ఆహారం సంపాయించే శక్తి లేదు. ఆకలితో కృశించి చచ్చేకన్న, యీ క్షణాన చావటమే దానికి హాయి," అంటూ కత్తి ఎత్తి పులి తల నరికేందుకు దానికేసి కదిలాడు.

ఈ లోపల సిద్ధసాధకుడు కనిపించకుండాపోయిన తన శూలం కోసం వెతకసాగాడు. అది నీటి ఒడ్డున కొంచెం దిగువగా అతడికి దొరికింది. అతడు ఉత్సాహంగా శూలం పట్టుకుని జయశీలుడి కేసి బయలుదేరాడు. జయశీలుడు తలవంచి పులి కేసే చూస్తూ, "సాధకా,

యీ పులి మనకు చేసిన హాని ఏమీ లేదు గదా? దీన్ని చంపటానికి నాకు చేతు లాడటం లేదు,'' అన్నాడు.

సిద్ధసాధకుడు, జయశీలుడి చేతి నుంచి కత్తి తీసుకుని, ''ప్రాణాలతో నరక బాధపడే యీ పులికి, బాధా నివృత్తి చేస్తున్నాం. అలా చేయటం పుణ్యం!'' అంటూ కత్తితో ఒక్క వేటుకు పులి తలను మొండెం నుంచి వేరుచేశాడు.

జయశీలుడు చుట్టూ ఓ మారు కలయ చూసి, ''సాధకా, యిప్పుడు మన ప్రయాణం ఎటువైపు? కనకాక్షరాజుగారి పిల్లలను అపహరించుకుపోయినవ్వాడి బంటును మనం వదిలేశాం. వాణ్ణి వదలవలసింది కాదు,'' అన్నాడు.

''జయశీలా, వాణ్ణి మనం వదిలామో లేక వాడే మనను వదిలించుకున్నాడో చెప్పటం కష్టం. ఆ జలగ్రహంతోపాటు మనం నీటిలో ఎంతకాలం బతగ్గలం? అయినా, యిప్పుడు ఆలోచించవలసింది, జరిగిపోయినదాన్ని గురించి కాదు. మనం ఎలాంటి ప్రాంతానికి చేరాం? ఈ ప్రాంతాల ఎక్కడైనా మానవనివాసా లున్నవా? అదీ ప్రశ్న!'' అన్నాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడి ప్రశ్నకు జవాబా అన్నట్టు, అతడు మాట ముగించే లోపలే,




నదికి దిగువనున్న గుబురుచెట్ల ప్రాంతా న్నుంచి ఒక మనిషి పెట్టిన చావు కేకా, కొండగొర్రె అరుపూ వినిపించినై.

''కొండగొర్రె మనిషిని పట్టిందా? లేక మనిషి కొండగొర్రెను పట్టాడా? ఇద్దరూ ప్రాణభయంతో అరిచినట్టుందే!'' అన్నాడు సిద్ధసాధకుడు, ఆ ధ్వని వచ్చినవైపుకు తిరిగిచూస్తూ.

''సాధకా, ఆ ఇద్దర్నీ మరేదో బలమైన క్రూరమృగం పట్టినట్టున్నది! ఊఁ, పరిగెత్తు,'' అంటూ జయశీలుడు నది దిగువ కేసి పరిగెత్తాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ అలా కొంతదూరం వెళ్ళేసరికి, వాళ్ళకు భయా



శ్చర్యాలు కలిగించే దృశ్యం ఒకటి కంటబడింది. నీటి ఒడ్డున వున్న ఒక మహావృక్షం కొమ్మ నుంచి, ఒక గొర్రెపొటేలూ, ఒక మరుగుజ్జుమనిషీ వేళ్ళాడుతున్నారు. చెట్టుకొమ్మలకు చాలా చిన్న చిన్న ఆకులున్నవి.

''ఇదేదో చాలా వింతగా వున్నది! కొమ్మ మీద ఎలాంటి ప్రాణీ లేదు. పొటేలునూ, మరుగుజ్జుమనిషినీ పైకి లాగుతున్నదెవరు?'' అన్నాడు జయశీలుడు.

''ఆ పని చేస్తున్నది అదృశ్యంగా వున్న ఏదో పిశాచి! నా శూలంతో దాని గుండెల్ని చీల్చబోతున్నాను,'' అంటూ సిద్ధసాధకుడు కొమ్మ కిందికి పోయి, శూలం ఎత్తబోయేంతలో మరొకచెట్టుకొమ్మ, అతడికేసి వంగి భుజం పట్టుకున్నది.

ఎవరో బలమైన మనిషి ఒకడు తన భుజం పట్టుకుని పైకి గుంజబోయినట్టు అనుమానం కలగ్గానే సిద్ధసాధకుడు ఎగిరి యివతలికి ఒక్క గంతువేసి, ''జయశీలా, జాగ్రత్తసుమా! ఇదేదో రాక్షసవృక్షం,'' అన్నాడు.

''రాక్షసవృక్షమో, పిశాచివృక్షమో నాకు తెలియదుగాని, ఇది అందుబాటులోకి వచ్చిన మనుషులనూ, జంతువులనూ పట్టుకుతినే చెట్టు మాత్రం అవును,'' అంటూ జయశీలుడు ఒక్కఎగురునపోయి, కత్తితో మరుగుజ్జువాణ్ణీ, కొండగొర్రెనూ పట్టుకున్న చెట్టుకొమ్మను నరికాడు. వెంటనే కొమ్మకు వేళ్లాడుతున్న యిద్దరూ దిగువనున్న నీళ్ళలో పడ్డారు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ గబగబా పోయి, నీటిలోపడిన మరుగుజ్జువాణ్ణి ఒడ్డుకులాగారు. గొర్రెపొటేలు గట్టుమీదికి ఎక్కి, ఒంటికిపట్టిన నీటిని ఒకటి రెండు సార్లు విదిలించుకుని, తలఎత్తి పెద్దగా అరిచింది.

''జయశీలా, ఇది మామూలు కొండ పొటేలు కాదు; దానికి సవారీ గుర్రానికి వున్నట్టు జీనూ, కళ్లెమూ—అన్నీ వున్నవి,'' అన్నాడు సిద్ధసాధకుడు.

అప్పటివరకూ చావుభయం, ఆ తర వాత నీళ్లమునకతో వడవడ వణికిపోతున్న మరుగుజ్జువాడు, జయశీలుడూ, సిద్ధ సాధకుల కేసి కళ్ళు చికిలించి చూస్తూ, ''అయ్యా, తన సేనానాయకుణ్ణి, మనుషు లను తినే చెట్టు నుంచి కాపాడినందుకు, మా గడేకారిరాణి తమకు తప్పక మంచి బహుమానం యిస్తుంది,'' అన్నాడు.

జయశీలుడు, మరుగుజ్జువాడి కేసి ఆశ్చర్యపోతూ చూసి, ''ఈ ప్రాంతాలను పాలిస్తూ ఒక రాణీ, ఆ రాణీకి సైనికులూ, ఆ సైనికులకు నీబోటివాడు సేనా నాయకుడూ వున్నారన్నమాట! వింతగా వుంది,'' అన్నాడు.



''జయశీలా, అన్నిటికన్నా వింత, యీ ప్రాణులను తినే చెట్టు. ఇలాంటి చెట్లు వున్నవని వినటమేతప్ప, యీనాటి వరకూ చూడలేదు,'' అంటూ సిద్ధ సాధకుడు చెట్టు వెనక్కు వెళ్ళి, గట్టిగా చప్పట్లుచరుస్తూ,'' జయశీలా, యీ రాక్షసి చెట్టుది మామూలు ఆకలి కాదు; కుంభ కర్ణుణి ఆకలి! ఇక్కడికొచ్చి చూడు, ఎన్ని జంతు, మానవ కంకాళాలు పడి వున్నవో,'' అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడి దగ్గిరకు పోయి, దిగువున పల్లంలోనూ, పొదల మీదా చెల్లాచెదరుగా పడి వున్న చాలా కంకాళాలను చూశాడు. అలా చూస్తూ, అతడు చెట్టుకొమ్మల కిందికి వచ్చేసరికి, దిగువగా వున్న కొమ్మ ఒకటి జుయ్ఁ మంటూ వంగి, అతణ్ణి పట్టుకోబోయింది. జయశీలుడు చప్పున దూరంగా పరిగెత్తి పోయి, వింతపడుతూ చెట్టు కేసి చూడ సాగాడు.

మరుగుజ్జు సేనాని, తన వాహనం అయిన కొండ పొటేలును కళ్ళెం పట్టు కుని నడుపుతూ, జయశీలుడూ, సిద్ధ సాధకుల ముందుకు వచ్చి, ''అయ్యా, నన్ను ప్రాణాపద నుంచి కాపాడి, గడే కారిజాతికి చాలా మేలు చేశారు. రండి, రాణిగారి దగ్గరకు వెళదాం,'' అన్నాడు.



ఆ మాటలకు సాధకుడు గట్టిగా విసుక్కుని, "ఛీ, ప్రాణాలు తీస్తుందని ఎరిగి వున్న చెట్టు నుంచి, నిన్ను నీవు కాపాడుకోలేని వాడివి, ఒక సేనానాయకుడివా? మీ రాణి మాకేం బహుమానం యిస్తుంది? బహుశా యిన్ని చిలకడదుంపలూ, ఒక సోలెడు వెదురుబియ్యమూ, అంతేనా? ఇక నీ దారిన నువ్వు పో. మా దారి మేం చూసుకుంటాం," అన్నాడు.

ఆ యీసడింపుకు మరుగుజ్జు సేనాని ముఖం చిన్నబుచ్చుకుని ఏం చేయటమా అని దిక్కులు చూసేంతలో, చెట్లచాటున పెద్ద కలకలం బయలుదేరింది. జయశీలుడూ, సాధకుడూ, ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పారు. రెండు కొండ పొటేళ్ళను పూన్చిన రథం మీద జింక చర్మాలు ధరించి, కొంగా, నెమలి ఈకలు కలిపి కుట్టిన కిరీటం పెట్టుకున్న ఒక స్త్రీ వాళ్ల కేసి వచ్చింది. ఆ రథం వెనకా, పక్కలా పొటేళ్ళను ఎక్కి, చేత బల్లాలను పట్టుకున్న చాలామంది మరుగుజ్జు వాళ్ళు వున్నారు.

వాళ్ళను చూస్తూనే మరుగుజ్జు సేనాని ముందుకు పోయి, "మహారాణీ!" అంటూ రథంలో వున్న మరుగుజ్జు స్త్రీకి వంగి నమస్కారం చేసి, ఆమెకు, జయశీలుణ్ణీ, సాధకుణ్ణీ చూపుతూ, "ఈ ఇద్దరూ నన్ను జీవభక్షకవృక్షం నుంచి కాపాడారు," అని చెప్పాడు.

మరుగుజ్జు రాణి రథాన్ని జయశీల, సిద్ధసాధకుల ముందు ఆపి, "ఓం, మహాకాయుల్లారా, రాత్రి నా కలలో కనిపించి, మా గడేకారిజాతి శత్రువులనందరినీ హత మార్చి, మాకు శాశ్వత రక్షణ కల్పిస్తామని మాట యిచ్చిన వాళ్ళు, మీరే కదా?" అని అడిగింది.

"ఈ రాణీ ఏదో పెద్ద గడుసుపిండం లాగుందే! జయశీలా, మనం తగు జాగ్రత్తలోవుండాలి," అన్నాడు సాధకుడు మెల్లిగా, జయశీలుడితో.

"మంచి మాట నేర్పరి! పాపం, యీ పొట్టి మనుషులకు ఎవరి నుంచి ప్రమాదం రానున్నదో! వీలైతే సాయం చేద్దాం," అన్నాడు జయశీలుడు.

ఆ మాటలకు సాధకుడు అయిష్టంగా ముఖం పెట్టి, "జయశీలా, మనం ఒక మహోన్నత కార్యం సాధించేందుకు బయలుదేరాం. ఆ సంగతే మరిచి, ఈ పిల్లిపెసర గింజలు ఏరే పనుల్లో పడ్డామంటే, ఎందుకూ కొరగాకుండా పోతాం," అన్నాడు.

"సాధకా, కనకాక్షరాజుగారి పిల్లల ప్రాణాల్లాంటివే. యీ మరుగుజ్జు మనుషుల ప్రాణాలు కూడా. 'వీళ్ళకు ఎవరి నుంచి ప్రమాదం రానున్నదో విని చేతనైన సాయంచేయటం అన్నివిధాలా ధర్మం అనిపించు కుంటుంది." అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట ముగించే లోపలే దాపులనున్న ఒక కొండ గుట్ట మీదినుంచి భయం గొల్పే అరుపు వినిపించింది. జయశీలుడితో పాటు అందరూ అటు కేసి తలలు తిప్పి చూశారు. పదీ పన్నెండడుగుల ఎత్తున్న వికృతాకారం ఒకటి గుట్టమీద నిలబడి వున్నది. అది రెండు చేతులతో ఒక పెద్ద బండరాయిని ఎత్తి పట్టుకుని వున్నది. దాని నడుముకు కట్టిన ఇనపగొలుసును ఒక చేత్తో పట్టుకుని, రెండవ చేతిలో కత్తి పట్టుకుని, ఒక మనిషి నిలబడి వున్నాడు.



అ వికృతాకారాన్ని చూస్తూనే, మరుగుజ్జురాణితో పాటు, ఆమె అను చరులందరూ గడగడ వణికిపోసాగారు. అంతలో వికృతాకారం పక్కన నిల బడినవాడు, కత్తితో దాన్ని వెన్నుమీద గీరాడు. వికృతాకారం రాయిని అలాగే పట్టుకుని, అరుస్తూ అటూ యిటూ గెంత సాగింది.

జయశీలుడు, సిద్ధసాధకుడితో, ''సాధకా, ఆ భయంకర జంతువును మచ్చిక చేసి ఆడిస్తున్నవాడు మరుగుజ్జు కాదు; మనలాంటివాడే! ఇది, ఏ జాతి జంతువై వుంటుంది?'' అని, మరుగుజ్జు రాణితో, ''మహారాణీ! మీకు శత్రువు లన్నావే, వాళ్లు ఆ కనబడే భయంకర జంతువూ, దాని వెంటవున్న మనిషేనా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో రాణి కాస్త స్థిమితపడి, రథం దిగి జయశీల, సిద్ధసాధకుల ముందుకు వచ్చి, ''మహాకాయుల్లారా, మా శత్రువులు, కొండ అవతల వున్న మా లాంటి పొట్టి జాతివాళ్ళే. కాని, వాళ్ళు తాము యక్షజాతి నుంచి ఉద్భ వించామనీ, మా కన్న ఉన్నతులమనీ అహంకరించి, మమ్మల్ని నాశనం చేయ చూస్తున్నారు,'' అన్నది.

''అంత పెద్ద భయంకర ప్రాణిని మచ్చిక చేసినవాళ్ళు, మిమ్మల్ని ఏనాడో లొంగదీసుకుని వుండవలసిందే!'' అన్నాడు సిద్ధసాధకుడు.

''మహాకాయుల్లారా! ఆ భయంకర జంతువు, నరవానరం. దానిచేత మా మీదికి రాళ్ళు విసిరిస్తున్నవాడు, మీలాంటి మనిషి. ఆ ఇద్దరూ పదీ పన్నెండు రోజుల క్రితమే, మా శత్రు వులతో వచ్చి చేరారు,'' అన్నది మరుగుజ్జు రాణి.

రాణి మాట ముగించే లోపలే, నర వానరం ప్రళయ భయంకరంగా అరిచి, ఎత్తి పట్టుకుని వున్న బండరాయిని, కొండమీది నుంచి మరుగుజ్జు జాతి వాళ్ళ కేసి విసిరింది. —(ఇంకావుంది)





# రాచకొలువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు నీ ప్రయత్నంలో నెగ్గిన పక్షంలో ఫలితాన్ని వదులుకోకు. కొందరు శ్రమపడి విజయం సాధించి, దానివల్ల లభించే ప్రయోజనాన్ని కాలతన్నేస్తారు. ఇందుకు నిదర్శనంగా నీకు విశ్వనాధుడనే కృషీవలుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

చిత్రకూటంలో విశ్వనాధుడు అనేవాడు కర్షకుల కుటుంబంలో జన్మించాడు. ఏ పూర్వజన్మ సుకృతం చేతనోగాని అతనికి చిన్నతనం నుంచీ సంగీతంలో సహజ పాండిత్యం ఉంటూ వచ్చింది.

## బేతాళ కథలు

అది చూసి అతని తండ్రి అతన్ని తన ఇష్టం వచ్చినట్టు తిరిగి సంగీతం నేర్చుకో నిచ్చాడు. ఆ విధంగా విశ్వనాథుడు మంచి వైణికుడుగా తయారయి, ఇంటికి తిరిగి వచ్చి, తండ్రితోపాటు వ్యవసాయం పనులు రోజల్లా చేస్తూ, పొద్దుగూకి ఇంటికి వచ్చాక, ఇంటి అరుగు మీద వీణ వాయించుకుంటూ, పాడుతూ ఆనం దించేవాడు.

విశ్వనాథుడికి వివాహం అయింది. అతని భార్య మీనాక్షి కూడా తన భర్త వీణ వాయించటంలో అపార ప్రజ్ఞ గలవాడని గ్రహించింది. సాయంకాలం పూట అతను వీణ వాయిస్తూ, పాడు తూంటే వినటానికి మూగే వాళ్ళలో సంగీతం బాగా తెలిసినవాళ్లు కూడా ఉండేవాళ్ళు. అలాటివాళ్ళు మెచ్చినది విశ్వనాథుడి సంగీతం.

అనేకమంది విశ్వనాథుడితో, "ఇంత సంగీతం ఉన్న నిన్ను ఏ రాజైనా నిక్షేపంగా తన ఆస్థానంలో ఉంచుకుంటాడు. రోజల్లా, వాననక, ఎండనక ఒళ్ళు విరుచుకుని వ్యవసాయం చేసి నువు బావుకునేది ఏమిటి?" అన్నారు.

మీనాక్షికి కూడా మనసులో అలాటి ఉద్దేశం ఉండేది. కాని విశ్వనాథుడికి రాజుల వద్ద కొలువు చెయ్యాలనిగాని, అందుకోసం ఎవరినో ఆశ్రయించి తన సంగీతాన్ని ప్రదర్శనకు పెట్టాలనిగాని ఎంతమాత్రమూ లేదు. అది గ్రహించి



మీనాక్షి తన అభిప్రాయాన్ని అతనికి చెప్పలేదు.

అయితే ఆమె కోరిక ఎవరి ప్రయత్నమూ, శిఫార్సూ లేకుండానే తీరిపోయింది. ఒకనాడు విశ్వనాధుడు అరుగు మీద కూర్చుని వీణ వాయిస్తూండగా ఎవరో ఇద్దరు మనుషులు, ఏ వూరివాళ్ళో, వచ్చి అతని సంగీతం శ్రద్ధగా చివరిదాకా విని వెళ్ళిపోయారు.

వాళ్ళు మారువేషంలోవున్న ఆ దేశపు రాజూ, మంత్రినూ.

తరవాత కొద్ది రోజులకు రాజు విశ్వనాధుణ్ణి సగౌరవంగా తన వద్దకు రప్పించి, అతనికి తన ఆస్థానంలో ఉద్యోగం ఇచ్చాడు. మొదట విశ్వనాధుడికి ఆస్థానం ఖైదులాగా తోచినా, రానురాను గొప్ప వాళ్ళ మధ్య మసలటమూ, తన సంగీతాన్ని రాజు మొదలుకుని చిల్లర ఉద్యోగి వరకూ రోజూ మెచ్చుకుంటూ ఉండటమూ అతనికి ఆనందం చేకూర్చసాగాయి.

ఇలా ఉండగా ఒకసారి రత్నపురం నుంచి చిత్రకూటానికి కుంజరుడు అనే సంగీత విద్వాంసుడు తన శిష్యులతో వచ్చాడు. అతని కోరిక పై రాజు విశ్వనాధుడికీ, కుంజరుడికీ పోటీ ఏర్పాటు చేశాడు.

అయితే పోటీలో విశ్వనాధుడు ఓడిపోయాడు. ఎందుకంటే, విశ్వనాధుడు వీణ వాయించటంలో ఎంత ప్రావీణ్యం గలవాడైనప్పటికీ, కుంజరుడు సంగీ





తంలో అసమాన పాండిత్యం గలవాడు. ఆ సంగతి రాజుకూ, సభికులకూ మాత్రమే గాక విశ్వనాథుడికి కూడా కొట్టవచ్చినట్టు స్పష్టంగా కనిపించింది.

ఇది జరిగిన మరుక్షణం నుంచీ విశ్వనాథుడి పట్ల రాజుకూ, రాజు వద్ద కొలువుచేసే వారికీ ఆదరం ఒక్కసారిగా తగ్గిపోయింది. విశ్వనాథుడు వారి దృష్టిలో చేసిన పెద్ద నేరమేమంటే రాజ్యప్రతిష్ఠను నిలబెట్టలేక పోవటం.

ఈ సంగతి గ్రహించి విశ్వనాథుడు మానసికంగా అమిత బాధపడ్డాడు.

''మీ కెందుకు విచారం? జయాపజయాలు దైవాధీనాలు,'' అన్నది మీనాక్షి.

''నన్ను బాధిస్తున్నది అపజయం కాదు. నేను సమర్థుడి చేతిలోనే ఓడిపోయాను. రాజుగారి ప్రవర్తన నన్ను బాధిస్తున్నది,'' అన్నాడు విశ్వనాథుడు.

అతను ఒక నిర్ణయానికి వచ్చి, కొలువుకు వెళ్ళటం మానేసి, సంగీతంలో రాక్షససాధన ప్రారంభించాడు. ఆరు నెలల పాటు అతను అలా సాధన చేసినా అతను కొలువుకు రాలేదని విచారించిన వారులేరు.

ఆరు నెలలు సాధనచేసి విశ్వనాథుడు రత్నపురికి వెళ్ళి, కుంజరుణ్ణి తనతో పోటీకి ఆహ్వానించి, పోటీలో అతన్ని ఓడించాడు. కుంజరుడు పరమానందంతో విశ్వనాథుణ్ణి కౌగలించుకుని, తన ఓటమి ఒప్పుకుంటూ, విశ్వనాథుడి పట్టుదలను ప్రశంసించాడు.

విశ్వనాథుడు కుంజరుణ్ణి ఓడించి వచ్చాడని తెలియగానే రాజూ, అతని అనుచరులూ విశ్వనాథుణ్ణి చూడవచ్చి, అతని గొప్పతనాన్ని సరిగా గుర్తించనందుకు క్షమాపణ చెప్పుకుని, అతన్ని రోజూ ఆస్థానానికి వస్తూ ఉండవలసినదిగా కోరారు.

విశ్వనాథుడు వారితో తనకు యిక ఆస్థాన ఉద్యోగం అవసరం లేదనీ, తాను తన గ్రామానికి తిరిగి పోతున్నాననీ

చెప్పాడు. అతను తన ఇంటికి తిరిగి వచ్చి, పూర్వంలాగే పగలు వ్యవసాయం చేసుకుంటూ, సాయంకాలం వీణ వాయించుకుని, వినవచ్చే వారిని ఆనంద పరుస్తూ, సుఖంగా జీవించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశ్వనాథుడు ఎలాటి మనిషి అనాలి? అతను పోటీలో ఓడిపోయినప్పుడు సంతోషంగా ఎందుకు ఓటమి ఒప్పుకున్నాడు? ఓటమికి అభ్యంతరం లేని వాడు ఆరుమాసాలు రాక్షససాధన చేసి కుంజరుణ్ణి పనిపెట్టుకుని ఎందుకు ఓడించాడు? ఓడించి రాజుగారి సద్భావాన్ని తిరిగి సంపాదించుకున్న వాడు ఆస్థాన విద్వాంసుడి పదవి వదులుకుని, ఇంటికి తిరిగివచ్చి, వ్యవసాయం ఎందుకు చేసుకున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విశ్వనాథుడు సంగీత ప్రవీణుడే కాదు, సంగీతప్రియుడు. అతను తన ఆనందం కోసం వీణ వాయించుకుంటూ బతుకు తెరువుకోసం వ్యవసాయం చేసుకునేవాడు. అయితే రాజుగారి దృష్టిలో పడటంతో అతనికి సంగీతమే బతుకుతెరువయింది. తన కన్న గొప్పవాడు తనను ఓడిస్తే అందులో అతనికి అవమానం కనిపించలేదు. కాని అది రాజుగారికి అవమానమయింది. గొడ్డుసాధన చేసి ఎవరైనా విజయం సాధించవచ్చుననీ, సంగీత ప్రియత్వానికీ, జయాపజయాలకూ సంబంధం లేదనీ నిరూపించటానికి అతను కుంజరుణ్ణి ఓడించాడు. కాని సంగీతం బతుకు తెరువుగా పెట్టుకోవటంలో సుఖంగాని, మనశ్శాంతిగాని లేవని తెలిసివచ్చి, విశ్వనాథుడు రాజుకొలువు మానేసి, తన ఇంటికి తిరిగివచ్చి, మళ్ళీ వ్యవసాయం చేపట్టాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజుగారి పోటీలు

ఒకప్పుడు కాంభోజరాజ్యాన్ని కుమారవర్మ పాలించాడు. తాను అన్నివిద్యలలోనూ సాటిలేనిమేటి అనీ, ప్రజారంజకంగా రాజ్యంచేయడంలో తనకుతానేసాటి అనీ ఆయనకు గట్టినమ్మకం.

ఒకసారి ఆయన భార్య కర్పూరవల్లి తన భర్తతో ఛలోకిగా వారసత్వంతో రాజుకావడం విశేషం కాదనీ, స్వశక్తితో రాజ్యాన్ని సంపాదించుకోవడమే గొప్ప అనీ అన్నది. రాణి ఈ మాటలు పరిహాసానికి అన్నప్పటికీ, కుమారవర్మ మీద అవి బాగాపనిచేశాయి. తన గొప్పతనం రాణికి రుజువుచెయ్యాలని ఆయన అనేకరంగాలలో పోటీలు ఏర్పాటుచేశాడు.

ఆ పోటీలలో పాల్గొనడానికి దేశం అన్ని ప్రాంతాల నుంచీ ఉత్సాహవంతులైన యువకులూ, శక్తిమంతులూ వచ్చారు. ఆయారంగాలలో ప్రవీణులైనవారు నిర్ణేతలుగా పనిచేశారు. పోటీలు జయప్రదంగా ముగిశాయి. బహుమతి ప్రదానం జరగవలసి ఉన్నది.

కుమారవర్మ, కత్తియుద్ధంలో ఉత్తముడుగా నిర్ణయించబడిన రామరాజు అనే అతన్ని చూపి, ''మన దేశంలో ఇంతకు మించిన ఖడ్గయుద్ధ నిపుణుడు లేడని తేలిందిగదా?'' అన్నాడు.

సభలో అందరూ అవునన్నారు.

''ఆ సంగతి నేను తేల్చాలి,'' అంటూ రాజు కత్తి చేతబట్టి రామరాజుతో యుద్ధానికి వచ్చాడు. అందరూ ఆశ్చర్యపోయారు. రామరాజుకూ, కుమారవర్మకూ చాలాసేపు తీవ్ర పోరాటం జరిగింది. చివరకు రామరాజు కుమారవర్మ చేతి కత్తిని ఎగరగొట్టేశాడు. కుమారవర్మ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు.

"వసుంధర"

ఇంతలో నిర్ణేతలు ముందుకు వచ్చి, రామరాజు నియమాలను ఉల్లంఘించాడన్నారు. వాళ్ళు రామరాజుకు రహస్యంగా ఏదో చెప్పారు. రామరాజు కుమారవర్మ వద్దకు వచ్చి, చేతులు జోడించి, ''ప్రభూ, మీ చాకచాక్యానికి తట్టుకోలేక నియమాలు కొన్నిటిని తప్పాను. తమతో మరొకసారి యుద్ధం చేసే అవకాశం ఇప్పించండి,'' అన్నాడు.

ఈ సారి కుమారవర్మ రామరాజు చేతి కత్తిని అతి శీఘ్రంగా ఎగరగొట్టేశాడు. బహుమతి రాజుకు లభించింది.

ఇదేవిధంగా సాహిత్యగోష్ఠిలో అందరినీ ఓడించిన విద్యానాధుణ్ణి రాజు సవాలు చేశాడు. ఇద్దరూ చర్చ జరుపుతూండగా మధ్యలో నిర్ణేతలు విద్యానాధుడిలో వ్యాకరణ దోషాలు కలిగాయని, బహుమతి రాజుకే నిర్ణయించారు.

ఒకటేమిటి? అన్ని రంగాలలోనూ రాజు బహుమతులను ఇలాగే సంపాదించుకున్నాడు. ఇలా ఒక సంవత్సరం కాదు, అయిదు సంవత్సరాలపాటు కుమారవర్మ తాను ఏర్పాటు చేసిన పోటీలన్నిటిలోనూ తానే బహుమతులు పొందాడు. ఆయన ఈ సంగతి గర్వంగా తన భార్యకు చెబితే, ఆమె నవ్వి ఊరుకున్నది.



ఇలా ఉండగా కుమారవర్మకు ఒక దారుణ వార్త తెలిసింది. మంత్రి భైరవుడు చాలాకాలంగా రాజ్యాన్ని కాజేసేటందుకు కుట్ర చేస్తున్నాడు. ఆయన పథకం దాదాపు పూర్తి అయింది.

ఈవార్త తెలియగానే కుమారవర్మ, తన భార్యతో సహా రహస్యమార్గాన తప్పించుకుని, మారువేషాలతో నగరం విడిచి పారిపోయాడు. ఇక రాజు మామూలు మనిషి గనక, మంత్రి నిశ్చింతగా రాజ్యాభిషేకం చేసుకున్నాడు.

కుమారవర్మా, కర్పూరవల్లీ ఒక మారుమూలగ్రామం చేరి, మారు పేర్లు పెట్టుకుని, పేదవాళ్ళ దుస్తులు ధరించి,



కాయకష్టం చేసుకుని బతకసాగారు. ప్రజలమధ్య బతకటం ప్రారంభించినాక కుమారవర్మకు ప్రజల అవసరాలూ, కష్టసుఖాలూ బాగాతెలిసి వచ్చాయి. ఎందుకంటే, అవి ఇప్పుడు తనవికూడానూ. తన పరిపాలన తాను అనుకున్నట్టు ప్రజారంజకంగా ఉంది ఉండలేదనీ, తన పాలనలో ప్రజలకు అన్యాయం చాలా జరిగిందనీ ఆయనకు ఇప్పుడు తెలిసివచ్చింది.

ఆ సంవత్సరం కూడా రాజధానిలో ఎప్పటిలాగే పోటీలు జరుగుతాయని తెలిసి ఆయనకు చాలా ఉత్సాహం కలిగింది. అయితే ఆ పోటీలను గురించి యువకులలో ఎలాటి ఉత్సాహమూ లేకపోవటం చూసి ఆశ్చర్యపడి, చాలామందిని కారణం అడిగితే, "ఎందుకొచ్చిన పోటీలు? బహుమతులు రాజుగారికే గద!" అన్నారు, పెదవి విరుస్తూ.

తన ప్రతిభను ప్రజలు గుర్తుంచుకున్నారనుకుని కుమారవర్మ సంతోషించాడు. కాని ఇప్పుడు రాజు భైరవుడు మంత్రాలోచనలో తప్ప ఇంకెందులోనూ సామర్థ్యం గలవాడు కాడు. ఆ కారణం చేత కుమారవర్మ పోటీలలో పాల్గొని, బహుమానాలు పొందుదామని రాజధానికి బయలుదేరి వెళ్ళాడు.

వేరు వేరు రంగాలలో పోటీకి వచ్చిన వారి శక్తి సామర్థ్యాలు చూస్తుంటే కుమారవర్మకు ఆశ్చర్యం కలిగింది. దేశం బొత్తిగా చచ్చుపడిపోయినట్టున్నది. కుమారవర్మ చాలా రంగాలలో నెగ్గాడు.

అన్ని రంగాలలోనూ గెలిచిన వారిని చిట్టచివరకు, రాజైన భైరవుడు సవాలు చేశాడు. అతనికీ, కుమారవర్మకూ కత్తి యుద్ధం జరిగింది. కుమారవర్మ కొద్ది క్షణాలలోనే భైరవుణ్ణి నిరాయుధుడుగా చేశాడు. వెంటనే నిర్ణేతలు కలగజేసుకుని, కుమారవర్మ నియమోల్లంఘన చేశాడనీ, లేకపోతే విజయం భైరవుడిది అయి ఉండేదనీ అన్నారు. వాళ్ళు కుమారవర్మను అవతలికి తీసుకుపోయి,

'' వెర్రివాడా, నువు పోటీ చేస్తున్నది ఒక వ్యక్తితో కాదు, ఒక గొప్ప పదవితో! నువు ఓడిపోవలసినది భైరవుడికి కాదు, సింహాసనానికి! రాజును క్షమాపణ కోరి, మరొక పోరాటానికి అవకాశం వేడుకుని, ఈసారి ఓడిపో! లేకుంటే ప్రమాదంలో పడగలవు,'' అన్నారు.

గత్యంతరం లేక కుమారవర్మ వాళ్ళు చెప్పినట్టే చేసి, రెండోసారి భైరవుణ్ణి గెలవనిచ్చాడు. తాను రాజుగా ఉంటూ బహుమానాలందు కోవటంలో ఉండిన రహస్యం కుమారవర్మకు అర్థమయింది.

అతను గ్రామానికి తిరిగి రాగానే కొంతమంది అతనితో, '' ఏమయింది? అన్ని రంగాల్లోనూ భైరవమహారాజే గెలిచాడా? ఈ భాగ్యానికి శ్రమపడి రాజధానికి ఎందుకు వెళ్ళావు? నీకు బహుమతే కావాలంటే నువు రాజువు కావాలి,'' అన్నారు.

భైరవుడి పరిపాలనలో ప్రజాపీడన అంతకంతకూ హెచ్చిపోతున్నది. అది గ్రహించి కుమారవర్మ దేశ సంచారం చేసి, ఉత్సాహ ధైర్యాలు గల యువకులను తనతో చేర్చుకుని, రహస్య సైన్యాన్ని తయారు చేసుకున్నాడు. ఆ సైన్యానికి నాయకుణ్ణి ఎన్నుకోవటానికి యువకుల మధ్య పోటీలు జరిగాయి. అమిత ఉత్సాహంతో జరిగిన యుద్ధ విద్యల పోటీలన్నిటిలోనూ కుమారవర్మ నెగ్గి, సేనానాయకుడుగా ఎన్నుకోబడ్డాడు.



తిరిగి రాజ్యాన్ని సంపాదించటానికి కుమారవర్మ చాలా చక్కనిపథకం ఆలోచించాడు. మరుసటి ఏడు జరిగిన పోటీలకు కుమారవర్మ తన సైన్యాన్ని వెంటబెట్టుకుని వెళ్ళి, యుద్ధవిద్యలకు సంబంధించిన పోటీలన్నిటా నెగ్గాడు.

తరవాత భైరవుడు అతన్ని కత్తి యుద్ధంలో సవాలు చేశాడు. కుమారవర్మ అతి సులువుగా భైరవుడి చేతి కత్తిని ఎగరగొట్టి, తన కత్తిని భైరవుడి గుండెలకు ఆనించి, అక్కడ చేరిన ప్రజలతో, "ఈ దుర్మార్గుడు నన్ను చంపాలని చూశాడు, కాని విశ్వాసపాత్రులు హెచ్చరించటం వల్ల నేను ప్రాణాలతో బయట పడ్డాను. నేను ఒకప్పుడు మీ రాజును, కుమారవర్మను. ఈ భైరవుడు ప్రజారంజకంగా మిమ్మల్ని పరిపాలించి ఉంటే నేను కలుగజేసుకుని ఉండను. ప్రజల క్షేమం కోసమే నేను ముందుకు వచ్చాను. నన్ను తిరిగి రాజుగా మీరు ఆమోదిస్తారా? లేక సింహాసనం కోసం యుద్ధం చెయ్యాలా?" అంటూ తన మారువేషం తొలగించాడు.

సభికులు జయజయధ్వానాలు చేశారు. రక్తపాతం అవసరం లేకుండానే రాజ్యం తిరిగి కుమారవర్మ వశమయింది.

తిరిగి రాణి అయిన కర్పూరవల్లి తన భర్తతో, "మీరే కుమారవర్మ అని మీ సైన్యానికి తెలియనిచ్చి ఉంటే మీరు ఎప్పుడో రాజు అయేవారుగదా?" అన్నది.

"ఈసారి రాజ్యాన్ని వారసత్వంగా కాక స్వశక్తితో సంపాదించదలిచాను. ఇప్పుడు నా శక్తిలో నాకు నమ్మకం కలిగింది గనక, నేను నిర్వహించే పోటీలలో నేను పాల్గొనే అవసరం లేదు," అన్నాడు కుమారవర్మ.

తరవాత ఆయన ప్రజాజీవితం నుంచి నేర్చుకున్న అనుభవంతో ప్రజారంజకంగా పాలించాడు. ఆయన పాల్గొనటం మానటంచేత ఆయన నిర్వహించే పోటీలు నిజమైన శక్తి సామర్థ్యాలు గలవాళ్ళను ఆకర్షించాయి.





# దైవాధీన జీవితం

మధురాపురంలో గోపయ్యా అనే యువకుడు గాలికి తిగుతూండేవాడు. ఆ గ్రామానికి చెందిన కాళికాలయం పూజారి భూషయ్య దృష్టి గోపయ్య మీద పడింది. భూషయ్యకు గోపయ్య లాంటి వాడి అవసరం ఎంతైనా ఉన్నది.

గ్రామం దీనస్థితిలో ఉండిన కాలంలో గ్రామస్థులు కాళికాదేవినే అన్నిటికీ నమ్ముకుని, ఆవిడకు మొక్కులూ, ముడుపులూ, నైవేద్యాలూ బాగా చెల్లించేవారు. అందుచేత పూజారి భూషయ్య పని మూడు పూలూ, ఆరు కాయలుగా ఉండేది.

ఇటీవల గ్రామానికి మంచి సౌకర్యాలు ఏర్పడ్డాయి. పంటలు బాగా పండుతున్నాయి. ప్రజలకు రోగాలబాధ కూడా అంతగా ఉండటంలేదు. వచ్చే రోగాలేవో కాళికాదేవి అనుగ్రహం అవసరం లేకుండానే మందులతో నయమవుతున్నాయి.

గ్రామస్థులకు దేవి భయం తగ్గిపోయిన కొద్దీ భూషయ్య రాబడి కూడా తగ్గిపోయింది. ప్రజలలో దైవభీతి కలిగించటానికి ఒక నాటకం ఆడాలి. అందుకు భూషయ్యకు కావలసినది గోపయ్యలాగా గాలికి తిరిగేవాడు. అందుచేత భూషయ్య గోపయ్యను చేరదీసి, భక్తులు దేవి కిచ్చే నైవేద్యాలు తినటానికి ఇచ్చి, అప్పుడప్పుడూ చిల్లర డబ్బులు కూడా వాడి చేతిలో పెట్టి, క్రమంగా వాణ్ణి మంచి చేసుకున్నాడు.

ఒకనాడు భూషయ్య గోపయ్యతో, "ఒరే అబ్బీ, నేను చెప్పినట్టు చేశావంటే నీకు ఇప్పుడున్న చెడ్డపేరు పోయి గొప్పపేరు వస్తుంది. మన ఎత్తు పారిందంటే నీకు కొంత నెల జీతం కూడా ఏర్పాటు చేయగలను," అని, గోపయ్య ఏంచెయ్యవలసినదీ చెప్పాడు.

ఎం. వి. వి. సత్యనారాయణ



భూషయ్య తాను ఆడదలచిన నాటకం గురించి అంతా చెప్పినాక, అందులో తన పాత్ర తాను నిర్వహించటానికి గోపయ్య ఒప్పుకున్నాడు.

సాయంత్రం ఇంటికి వస్తూనే గోపయ్య విరుచుకుపడిపోయాడు. వాడి తల్లి దండ్రులు పైత్య వికారమనుకున్నారు. వెధవ తిరుగుళ్ళు తిరుగుతున్నందుకు కొట్టబోయిన తండ్రికి గోపయ్య ఎదురు తిరిగి, "మింగేస్తాను రోయ్!" అని పెడ బొబ్బలు పెట్టాడు.

దారేపోతూ వింత చూడటానికి మూగిన వాళ్ళు, "ఈ అబ్బాయికి పూనకం!" అన్నారు.

పిలిచినట్టుగా, పూజారి భూషయ్య వేప కొమ్మలతో పరుగు పరుగున అక్కడికి వచ్చి, "ఎవరు, తల్లీ, నువూ?" అని అడిగాడు.

గోపయ్య పూజారి జుట్టు పట్టుకుని ఊపి ఒక్కతోపు తోసి, "శుంఠా, నన్నే గుర్తుపట్టలేదుట్రా?" అన్నాడు.

కింద పడిన పూజారి సాష్టాంగపడి, "తల్లీ, నువా? రక్షించు, కాళీమాతా! అపచారం జరిగింది, రక్షించు, తల్లీ!" అన్నాడు.

"మింగేస్తాన్రోయ్! ఊరు వల్లకాడు చేస్తాన్రోయ్! ఆహారం!" అన్నాడు గోపయ్య.

"ఆహారం ఇచ్చుకుంటాం, తల్లీ! శాంతించు!" అన్నాడు పూజారి భూషయ్య.

తరవాత గోపయ్యకు స్పృహతప్పినట్టు కనబడింది. మొహాన నీళ్ళు చల్లినాక వాడు నిద్రలేచినట్టు లేచాడు.

ఈ నాటకం వృథాపోలేదు. గ్రామస్థులు దేవతకు భయపడి, మొక్కుబళ్ళు చాలా ఎక్కువగా చెల్లించసాగారు. భూషయ్య పని బాగయింది. దేవత పూనినాక గోపయ్యను గ్రామంలో వాళ్ళు గౌరవంగా చూడసాగారు. వాడు రోజూ సాయంకాలం పూట అంతా దేవాలయంలోనే ఉండి, భూషయ్య ఇచ్చినవి తెచ్చి ఇంట్లో ఇచ్చే

వాడు అందుచేత వాడికి ఇంట్లో కూడా గౌరవం పెరిగింది.

దేవత మీద భక్తివిశ్వాసాలు పెరిగిన మీదట గ్రామస్థులు అన్నింటికీ ఆ దేవినే నమ్ముకోసాగారు. దాదాపు అందరూ కాళికాలయానికి రోజూ వెళ్ళి, దేవికి దణ్ణం పెట్టుకుని వచ్చేవాళ్ళు. ఈ మార్పు గోపయ్యకు నచ్చలేదు.

గోపయ్య పూజారిని కలుసుకుని తాను ఇక పూనకం నటించనన్నాడు. పూజారి ఇంకా హెచ్చు డబ్బులిస్తానన్నాడుగాని గోపయ్య ససేమిరా అన్నాడు.

భూషయ్య గొంతులో పచ్చి వెలగ కాయ పడింది. "అయితే నేను పూనకం నటిస్తాను. నువు వేపమండలు పట్టూకునే వేషం నటించు," అన్నాడతను.

గోపయ్య కొంచెం మెత్తబడ్డాడు. డబ్బు ఊరికే వస్తున్నది మరి! అయినా ఈ నాటకం ఇలా ఆడుతూ పోయినందు వల్ల తన ఇంట్లో వాళ్ళకు దైవాధీనం జబ్బు మరీ ఎక్కువైతే, ఈ నాటకం సంగతి తన ఇంట్లో వాళ్ళకు చెప్పటానికి కూడా వాడు నిశ్చయించుకున్నాడు.

పూజారికి ఇంకో కొత్త ఆలోచన వచ్చింది. గోపయ్య చీకటితోనే వచ్చి, గుడిలో అమ్మవారి విగ్రహం చాటున దాక్కుని, కనపడకుండా అమర్చిన



తాళ్ళులాగి, భక్తులు వచ్చే సమయానికి గుడి తలుపులు తెరుచుకునేటట్టు చేస్తాడు. గుడి తలుపులు వాటంతట అవే తెరుచుకుంటున్నాయని నమ్మి, ఊళ్ళోవాళ్ళు అమ్మవారిని మరింత విశ్వాసంతో కొలుస్తారు.

ఈ ఉపాయం పూజారి గోపయ్యకు చెప్పాడు. అది కూడా విజయవంతంగా అమలు జరిగింది. గ్రామస్థులకు తమ ఊరి దేవతలో అంతులేని గుడ్డినమ్మకం ఏర్పడిపోయింది. వాళ్ళు శ్రమపడటం మానేసి భజనలో పడ్డారు.

గ్రామం నాశనమైపోతున్నదని గోపయ్య గ్రహించాడు. వాడికి పూజారి

మీద పట్టరాని కోపమూ, తన మీద తనకే భరించరాని అసహ్యమూ కలిగాయి.

ఆ మర్నాడు దేవాలయం తలుపులు వాటంతట అవి తెరుచుకోలేదు. భక్తులు మళ్ళీ ఏం ముంచుకొచ్చిందోనని భయ భ్రాంతులయారు. సంగతి తెలియగానే పూజారి తన మనస్సులో గోపయ్యను తిట్టుకున్నాడు.

గోపయ్య బారెడు పొద్దెక్కి, వేప మండలతో సహా వచ్చాడు. ఏదో పొరపాటు జరిగిందనీ, అది సర్దుబాటు చెయ్యటానికి గోపయ్య వేప మండలతో సహా వచ్చాడనీ అనుకుని పూజారి వెంటనే పూనకం తెచ్చుకుని, ''చంపేస్తాన్రోయ్! పంట అంతా నాకు నైవేద్యం పెట్టండ్రోయ్!'' అంటూ అరవసాగాడు.

గోపయ్య వేపమండలతో పూజారిని దువ్వసాగాడు. వేప మండల మధ్య దూలగొండి మొక్కలున్నాయి. పూజారికి భరించరాని దురదలు ఆరంభమై, ఇంకా అరిచాడు.

గోపయ్య అతన్ని మండలతో బాదుతూ, ''దిగుతావా? దిగవా? ఈ గ్రామం వదిలిపోతావా? పోవా? అస్తమానమూ నీకే దిగబొయ్యడానికి ఇక్కడ ఏమైనా పాతర పోశామనుకున్నావా?'' అన్నాడు.

పూజారి ఆట కట్టయింది. దురదా, దెబ్బలూ భరిస్తూ పూనకం అభినయిం చటం అతనికి కష్టమయింది.

''పోతాను....పోతాను...'' అంటూ పూజారి నిజంగానే స్పృహ తప్పిపోయాడు.

గోపయ్య భక్తులతో, ''దేవి గ్రామం దాటిపోయింది. ఈ పాటికి పొలిమేర దాటి ఉంటుంది. మన పనులు మనం చేసుకున్నంత కాలమూ ఆమె మన జోలికి రాదు,'' అన్నాడు.

గుడి పాడుబడటానికీ, గ్రామం బాగు పడటానికీ ఎంతోకాలం పట్టలేదు.

పూజారి వ్యవసాయంలోకి దిగాడు. గాలికి తిరిగిన గోపయ్య అమ్మవారిని హడలగొట్టినవాడుగా పేరు తెచ్చు కున్నాడు.



# దాతృత్వం

అశ్వమేధయాగం చేసి, అంతులేని దాన ధర్మాలు చేసిన ధర్మరాజు తనను మించిన దాత ప్రపంచంలో ఏనాడూ ఉండి ఉండడని గర్వపడ్డాడు.

ఇది గ్రహించి కృష్ణుడు ఒకసారి ధర్మరాజును పాతాళానికి తీసుకు పోయాడు. అక్కడ రాజుగా ఉన్న బలి కృష్ణుడికి మర్యాదలుచేసి, ధర్మరాజును పలకరించను కూడాలేదు. అందు చేత కృష్ణుడు పరిచయం చేస్తూ, "ఇతను ధర్మరాజు. ఏ యుగంలోనూ ఎవరూ ఇతను చేసినన్ని దానాలు చెయ్యలేదు," అన్నాడు.

బలి చక్రవర్తి చెవులుమూసుకుని, "ఎంత పాడుమాట విన్నాను! దానధర్మాలు చేసి గొప్పవాడు కావటం కన్న హీనం ఏ మున్నది? నా రాజ్యంలో దానధర్మాలు చేస్తానంటే ఎవరైనా వస్తారా? ఎందుకు వస్తారు? అందరూ నా అంతటి వాళ్ళే!" అన్నాడు.

ఈ మాటలు విని ధర్మరాజు తల వంచుకున్నాడు. —కె. మూర్తి, బి.కాం.





# సతీపూర్ గ్రామస్థులు

సతీపూర్ గ్రామస్థులు వ్యవసాయంలో మంచి సమర్థత గలవారు కాని వారిది సుఖజీవనం కాదు. పనులు లేని తరుణంలోనూ, నారుమడులు వేసే టప్పుడూ వారు పెద్ద రైతులకు ఋణ పడవలసి వచ్చేది. తీరా ఫలితం చేతికి వచ్చే సమయానికి వారు పడిన శ్రమ అంతా బాకీలు తీర్చటానికే సరిపోయేది. వారి దారిద్ర్యానికీ, బాధలకూ అంతు కనిపించేది కాదు.

జుగల్‌ప్రసాద్ అనే భూస్వామి గొప్ప ధనవంతుడు. అతనికి నా అనేవారు ఎవరూ లేకపోయినా, ఎంతో దీక్షతో డబ్బు కూడబెట్టుతూ, ఖర్చు పెట్టాలంటే గిలగిలలాడేవాడు.

అదే గ్రామంలో మరి ఇద్దరు ధనికులు ఉండేవారు. వారు జుగల్‌ప్రసాద్ అంత ధనికులు కారు. కాని పేద రైతులకు డబ్బూ, ధాన్యమూ అప్పు పెట్టి, తమ బాకీలను నిర్దాక్షిణ్యంగా, వడ్డీలతోసహా వసూలు చేసుకునేవారు.

గ్రామస్థులు నిరక్షరులు. వారికి తమ పనులను గురించి తప్ప మరేమీ తెలీదు. అయితే, ఆ ఊరి కంసాలి కొడుకు గోపాలుడు అనేవాడు సతీపూరుకు ముప్పై మైళ్ళ దూరానగల పట్నంలో చదువు కుంటూండటం జరిగింది. అతని పెత్తం డ్రికి అక్కడ నగల దుకాణం ఉండేది. పట్నంలో హెచ్చుగా ఉంటున్న కారణం చేత అతనికి ప్రపంచజ్ఞానం హెచ్చుగా ఉండేది. తన ఊరివాళ్ళు ఎలా అప్పుల పాలై, నికృష్ట జీవితం గడుపుతున్నారో అతనికి తెలుసు. గ్రామీణ జీవితమూ, ఆర్థిక విధానాలూ, అభివృద్ధి అయే సహకార పద్ధతులు వగైరా విషయాలను గురించి అతను పట్నంలో విన్నాడు.

పట్నంలో గోపాల్ మిత్రుడు గంగాధరుడి అన్న ఇంద్రుడు అనేవాడు సంఘసేవకుడు. గోపాల్ గ్రామపు హీనస్థితిని గురించి విని అతను. "ఆర్థిక సహకార సంస్థ ఏర్పాటు చేస్తే మీ ఊరి సమస్య తీరిపోతుంది. అయితే ఆరంభంలో కొంత మూలధనం కావాలి," అన్నాడు.

"మూలధనం ఇయ్యగలవారు వడ్డీ వ్యాపారాలు చేసి ప్రజలను జలగల్లా పీలుస్తున్నారు. సహకారసంస్థతో వాళ్ళ ఆట కట్టదా?" అన్నాడు గోపాల్.

"అలా అయితే మరి మీ ఊరి పేద రైతులకు మోక్షం లేదన్న మాటే," అన్నాడు ఇంద్రుడు.

"జుగల్‌ప్రసాద్ మామను మనం కదిలించగలిగితే పని జరగవచ్చు. అయన వడ్డీ వ్యాపారి కాడు. అయితే నేం? పరమలోభి! అతడి నుంచి ఒక్క పైసా బయటికి లాగలేం!" అన్నాడు గోపాల్.

అంతదాకా వింటూ ఉండిన గంగాధరుడు, "మీ జుగల్‌ప్రసాద్ మూఢ నమ్మకాలు గలవాడేనా?" అని అడిగాడు.

"అలాటి మారు మూల పల్లెటూరిలో మూఢ విశ్వాసాల కేం తక్కువ?" అన్నాడు ఇంద్రుడు.




"అయితే నాకు తెలిసిన కొద్దిపాటి ఇంద్రజాలంతో అతనిలో విశ్వాసం కలిగించగలను," అన్నాడు గంగాధరుడు.

ఒకనాడు గోపాలుడూ, ఇంద్రుడూ, గంగాధరుడూ సైకిళ్ళ మీద బయలుదేరి, చీకటి పడేవేళకు సతీపూర్ చేరుకున్నారు. వాళ్ళు ఆ రాత్రి గోపాలుడి ఇంట గడిపారు.

మర్నాడు ఉదయం ఇంద్రుడు సిద్ధాంతిలాగా నటిస్తూ గ్రామస్థులకు హస్త సాముద్రికం చెప్పసాగాడు. ఆ విద్యలో అతనికి కొంత ప్రవేశం ఉండటం చేత కొందరు గ్రామస్థులు అతను చెప్పిన విషయాలకు ఆశ్చర్యపోయారు. ఈ హస్త



సాముద్రికం మాట జుగల్‌ప్రసాద్‌కు చేరేటట్టు గోపాలుడు చూశాడు. జుగల్ ప్రసాద్ పరిగెత్తుకుంటూ వచ్చి, తన చెయ్యి కూడా చూడమన్నాడు.

ఇంద్రుడు అతనితో, "మీ చెయ్యి ఇక్కడ చూడను. ఒంటరిగా మీ ఇంటి వద్ద చూస్తాను," అన్నాడు.

గోపాలుడు అంతకు ముందే ఒకసారి తన గ్రామానికి వచ్చి, కొన్ని వస్తువులు సిద్ధం చేసి ఉంచాడు. ఆ సాయంకాలం గోపాలుడూ, ఇంద్రుడూ, గంగాధరుడూ కలిసి జుగల్‌ప్రసాద్ ఇంటికి వెళ్ళారు.

ఇంద్రుడు జుగల్‌ప్రసాద్ చెయ్యి చూసి, "నిజంగా అదృష్టమంటే మీదే. అదేం చిత్రమో, లక్ష్మీదేవి ఉన్నవారినే అనుగ్రహిస్తుంది గాని శ్రమపడే పేదలను కనికరించదు. ఈ రోజే మీకు ఒక చిన్న నిధి దొరకబోతున్నది," అన్నాడు.

అతను జుగల్‌ప్రసాద్ చేతిని మరింత పరిశీలనగా చూసి, "మీ ఆవరణలో ఆగ్నేయ మూలగా మామిడిచెట్టు ఏదన్నా ఉన్నదా? దాని సమీపంలో దానంతట అదే మొలిచిన వంగ మొక్క ఉండాలి. దాని కింద అసలు వెండి రూపాయల నిధి ఉంటుంది. తవ్వి తెచ్చుకోండి," అన్నాడు.

ఈ మాట వినగానే జుగల్‌ప్రసాద్ కళ్లు ఆశతో మెరిశాయి. అతను లాంతరూ, పారా తీసుకుని ఒంటరిగా వెళ్ళాడు.

అతను తిరిగి వచ్చేలోపల గంగాధరుడు ఒక గాజుగ్లాసు తీసుకుని, గదిలో ఒక మూల ఎత్తు పీట మీద దానిని పెట్టి, ట్రిక్కు చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఒక అరగంట గడిచాక జుగల్‌ప్రసాద్ ఒక పిడతతో తిరిగి వచ్చాడు. దాన్ని అతను ఇంద్రుడి ముందుంచాడు. ఇంద్రుడు జాగ్రత్తగా దాని మూత సీలు ఊడదీసి, పిడతను నేల మీద బోర్లించాడు. బాగా కిలం పట్టిన విక్టోరియారాణి రూపాయలు యాభైదాకా ఉన్నాయి. జుగల్‌ప్రసాద్ కళ్ళు ఆనందంతో మెరిశాయి. అతను

గద్గదస్వరంతో, "అయ్యా, మీ శక్తి అద్భుతం!" అన్నాడు.

ఆ రూపాయలను గోపాలుడు తన పెత్తండ్రి వద్ద సంపాదించి, రసాయనాల సహాయంతో వాటికి కిలం పట్టించాడు. వాటిని పిడతలో పోసి, మూతపెట్టి సీలు చేసి, రెండువారాల క్రితం తాను తన ఊరు వచ్చినప్పుడు, గుర్తుగా ఆ పిడతను పాతిపెట్టాడు.

ఇంద్రుడు జుగల్‌ప్రసాద్ కుడిచెయ్యి తీసుకుని మళ్ళీ పరీక్షచేస్తూ, "ఇంకొక సంగతి కూడా మీకు చెప్పాలి. మీరు ఇనప్పెట్టెలో దాచిన ధనమంతా మీకు తెలియకుండా పారిపోయే ప్రయత్నంలో ఉన్నది. ఆ రూపాయలు నిర్బంధంలో ఉండటానికి ఒప్పుకోవటం లేదు. మీరు వెంటనే జాగ్రత్త పడకపోతే అవి మీ ఇనప్పెట్టె నుంచి తప్పించుకుని, ఐపు లేకుండాపోతాయి," అన్నాడు.

జుగల్‌ప్రసాద్ ఈ మాటను నమ్మలేనట్టుగా ఇంద్రుడి కేసి చూశాడు.

"మీరు నా మాట నమ్మినట్టు లేదు. ఒక పని చెయ్యండి. మీరు, మీ ఇనప్పెట్టె నుంచి ఒక రూపాయి తెచ్చి, ఆ మనిషికి యియ్యండి," అంటూ గంగాధరుణ్ణి చూపాడు.

జుగల్‌ప్రసాద్ లేచివెళ్ళి, ఇనప్పెట్టె నుంచి ఒకరూపాయి తెచ్చి గంగాధరుడికి ఇచ్చాడు. గంగాధరుడు దాన్ని ఎత్తు పీట మీద ఉన్న గ్లాసులో వేశాడు.



''మీ ఇనప్పెట్టెలో రూపాయి వైఖరి కాస్త చూడండి,'' అన్నాడు ఇంద్రుడు.

మరుక్షణమే రూపాయి కదిలి, గ్లాసులో నుంచి బయటికి పోయే ప్రయత్నాలు చేసింది; అది కొంత ఎత్తులేచి, మళ్ళీ పడిపోయింది. తరవాత అది గ్లాసులో గెంతసాగింది.

జుగల్‌ప్రసాద్ నోరు తెరిచి, కళ్ళు పెద్దవిచేసి దాన్ని చూడసాగాడు. కొద్ది సేపటికి అతను తన ఆలోచనలను కూడదీసుకుని, ''నా డబ్బు పారిపోకుండా ఏం చెయ్యాలి? మీ సలహా ఏమిటి?'' అన్నాడు.

"బీద రైతులకు తరుణంలో సహాయపడండి,'' అన్నాడు ఇంద్రుడు.

''నేను అందరిలాగా వడ్డీలకు డబ్బు అప్పియ్యను. ఏం సహాయం చెయ్యను?" అన్నాడు జుగల్‌ప్రసాద్.

''ఒక పని చెయ్యవచ్చు. ఈ గోపాల్ మీ ఊరివాడే! చదువుకున్నవాడూ, నమ్మదగిన వాడూనూ. రైతులకు ఎలా ఉపకారం చెయ్యవచ్చునో అతన్ని అడగండి. మీ డబ్బు నలుగురికీ ఉపయోగించే లాగా చలామణీ అయినప్పుడు అది మీకు అందుబాటులో లేకుండాపోదు,'' అన్నాడు ఇంద్రుడు.

గోపాలుడి సలహా మీద సీతాపూర్‌లో ఒక సహకారనిధికి కావలిసిన డబ్బు జుగల్‌ప్రసాద్ ఇచ్చాడు. తక్కువ వడ్డీ మీద రైతులు అవసరమైనప్పుడు ఆ నిధి నుంచి డబ్బుతీసుకున్నారు. ఊరు లాభం పొందింది. వడ్డీవ్యాపారులు దెబ్బతిన్నారు.

ఇంతకూ గంగాధరుడు గాజుగ్లాసులో రూపాయిని ఎలా ఆడించాడు? అతని వద్ద చాలా సన్నని, బలమైన నల్ల దారం ఉన్నది. దాని కొసకు మైనం అంటించి గంగాధరుడు తన వద్ద ఉంచుకుని, రూపాయికి ఆ మైనం అంటించి, గ్లాసులో వేశాడు. దారంరెండోకొస గోపాలుడిచేతిలో ఉన్నది. చీకట్లో దగ్గిర నుంచి చూసినా ఆ దారం కనిపించదు. ఆ రూపాయిని ఆడించినవాడు గోపాలుడే.



# శత్రు శేషం

ఒక నగరంలో రామయ్యా, రంగయ్యా అని ఇద్దరు ఇరుగు పొరుగు వాళ్ళుండేవారు. వారి మధ్య చాలాకాలంగా బద్ధవైరం ఉంటూండేది. శత్రుత్వం అగ్నిలాగా దహిస్తుందనీ, ఋణ శేషమూ, శత్రుశేషమూ ఉండరాదనీ అంటారు గనక, ఇద్దరికీ ఒకరి నొకరు నిర్మూలించాలని ఉండేది.

ఒకసారి రామయ్య మేకలు రెండు కట్టుతాళ్ళు తెంచుకుని, పొరుగున ఉన్న రంగయ్య దొడ్డిలో ప్రవేశించి కూరమొక్కలూ, పూలమొక్కలూ తినేశాయి. రంగయ్య మండిపడి ఆ రెండు మేకలనూ పట్టుకుని నరికి, వాటి కళేబరాలను రామయ్య దొడ్లోకి విసిరివేశాడు.

తరవాత కొంతసేపటికి రామయ్య గునపం తీసుకుని రంగయ్య ఇంటికి వచ్చాడు. అది గమనించి రంగయ్య బాణాకర్ర తీసుకుని యుద్ధానికి సిద్ధపడ్డాడు.

అయితే రామయ్య చాలా శాంతంగా, "క్షమించు, రంగయ్యా. నా అశ్రద్ధవల్లే నా మేకలు నీ దొడ్డి పాడుచేశాయి. మళ్ళీ పాదులు తవ్వి నీకు మొక్కలు నాటి పెడతాను," అన్నాడు.

రంగయ్యకు చచ్చే సిగ్గయింది. "తప్పు నాది, రామయ్యా. ఒళ్ళు తెలీని కోపంలో నోరులేని జంతువులను చంపాను. నన్ను క్షమించు," అన్నాడు.

శత్రుశేషం లేకుండా పోయింది.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి






# కళాభిమానం

భూపతి పెదరెడ్డిగారింటి పాలేరు. రెడ్డి గారి ఇంటి వెనక ఉన్న పాకలో ఉండే వాడు. వాడిది చక్కని కంఠం; పదాలు పాడుకుంటూ పనిచేసేవాడు.

రెడ్డిగారి భార్య ఒకసారి వాడికి అన్నం పెట్టుతూ, "ఎన్నాళ్ళు ఇలా ఒంటరిగా ఉంటావురా? ఎక్కడన్నా మంచి పిల్లను చూసి పెళ్ళి చేసుకో," అని సలహా ఇచ్చింది.

భూపతికి చాలా కాలంగా పెళ్లి ఆలోచన ఉన్నది. కాని పెళ్ళి ప్రయత్నాలు చేసే తీరిక లేదు. అందుచేత వాడు ఆమెతో, "అయ్యగారితో చెప్పి, ఒకవారంపాటు సెలవు ఇప్పించండి. పెళ్ళిచేసుకొస్తాను," అన్నాడు.

రెడ్డిగారు వాడికి సెలవు ఇచ్చాడు. భూపతి నాలుగు గ్రామాలు తిరిగి, చక్కని పిల్లను చూసి పెళ్లాడి, తనవెంట తెచ్చాడు. ఆ పిల్ల పేరు చంద్రకళ. అంతా ఆమెను కళ అని పిలిచేవాళ్ళు.

కళకు పెద్ద పాండిత్యం లేకపోయినా, జానపద ధోరణిలో గేయాలు రాసే నేర్పు పుట్టుకతోనే వచ్చింది. ఎండలు కాసినా, వానలు కురిసినా, మేఘాలు ఉరిమినా, మెరిసినా, పెళ్ళిళ్ళు అయినా, పండగలు వచ్చినా కళ పాటలు రాసేది. ఆ పాటలు వినసొంపుగానూ, సున్నితమైన భావాలు కలిగీ ఉండేవి.

రెడ్డిగారి భార్యకు కళ అంటే చాలా అభిమానం. పైపెచ్చు కళ రాసే పాటలు వినటం ఆమెకు గొప్ప సరదా. కళ కూడా తాను ఏ పాట రాసినా ముందు రెడ్డిగారి భార్యకు వినిపించేది. కళ చాలా చక్కగా పాటలు రాస్తుందని ఆవిడే ప్రచారం చేసింది. కళకు అభిమానులు చుట్టుపట్ల చాలామంది ఏర్పడ్డారు.

ఎం. కామేశ్వరరావు

ఇదిచూసి భూపతి స్నేహితుడొకడు అసూయతో కుమిలిపోయాడు. వాడి భార్యను గురించి చెప్పుకునేవాళ్ళు ఒక్కళ్ళయినా లేరు. అది ఒక అడవి జంతువు లాంటిది.

వాడు ఒకరోజు భూపతితో, "నీ పెళ్ళాం పాటలూ, పద్యాలూ రాస్తుందటగా? నువు డొక్కపొడిస్తే అక్షరంముక్క లేనివాడివి గదా, నీ పెళ్ళాన్ని అలా గాలికి వదిలేస్తే నిన్ను మనిషి కింద చూస్తుందా? పాచిపని చేసుకుని బతకవలసిన మనిషి పాటలు రాయటమూ, పదిమందికీ వినిపించటమూ—ఇదంతా పరువుమాలిన పని కాదుట్రా? కాస్త అదుపులో ఉంచి, పాటలూ పాడూ తగ్గించకపోయావో, త్వరలోనే నీ పెళ్ళాం నీ నెత్తికెక్కి కూర్చుంటుంది. తరవాత నీ యిష్టం!" అని హెచ్చరించాడు.

తన స్నేహితుడు తన మంచి కోరే ఈ మాట చెప్పాడనీ, అందులో చాలా నిజం ఉన్నదనీ భూపతికి తోచింది. వాడు ఇంటికి చేరేసరికి, కాకతాళీయంగా కళ ఏదో పాట రాస్తున్నది.

"ఎప్పుడూ ఆ పనికిమాలిన పిచ్చి రాతలు రాయకపోతే, నేను బయటిపని చూసి వచ్చేల్లోగా రెడ్డిగారి గేదెల పాలు పితకరాదూ? పిడకలు చెయ్యరాదా?



మనమేమన్నా పనీ పాటా లేకుండా కుడిచి కూర్చునేవాళ్ళమా? రెక్కాడితే గాని డొక్కాడదు మనకు!" అన్నాడు భూపతి తన భార్యతో.

కళ వెంటనే లేచి వెళ్ళి, పాలు పితికి రెడ్డిగారి భార్య కిచ్చి, మర్నాడు పిడకలు కూడా తానే చేసింది.

అదిమొదలు కళ పాటలు రాయటం మాని, రోజల్లా ఏదోపనిచేస్తూ గడపసాగింది. ఇలా చాలారోజులు గడిచింది. తన జీవితంలో పాటలు రాసుకునే అవకాశం పోయినందుకు ఆమె లోలోపల చాలా బాధ పడింది, కాని ఆ బాధ ఎవరికీ చెప్పుకోలేదు.

ఒకరోజు భూపతి రెడ్డిగారి తోటలో నీటిని మొక్కలకు మళ్ళిస్తూ గట్టిగా పాడుకుంటున్నాడు. సమీపంలోనే ఇద్దరు మనుషుల చేత కొబ్బరికాయలు దింపిస్తున్న రెడ్డిగారు భూపతితో, "నీ నోరు క్షణం ఊరుకోదుట్రా? ఎందుకు అస్తమానమూ ఆ పిచ్చిపాటలు అంత గట్టిగా పాడతావు? నోరు మూసుకుని పని చేసుకోరాదూ?" అని విసుక్కున్నాడు.

భూపతి మనస్సు చివుక్కుమన్నది. ఇంతవరకూ వాడి పాటను మెచ్చుకున్న వాళ్ళే గాని, దానికి వంకపెట్టినవాళ్ళు లేరు. వాడు నోరు మూసుకుని పని కొనసాగించాడు. కాని అంతదాకా ఉల్లాసంగా సాగిన పని ఇప్పుడు చాలా కష్టమనిపించసాగింది.

తరవాత రెండు మూడు సార్లు భూపతి పనిచేస్తూ తనకేతెలియకుండా పాడటమూ, రెడ్డిగారి చేత తిట్లు తినటమూ జరిగింది. వాడు పాడటమైతే మానాడుగాని, పని చేసేశక్తి బాగా తగ్గిపోయింది.

రెడ్డిగారు వాడితో ఒకనాడు, "ఏంరా, నువు వెనకటిలాగా పని చెయ్యటం లేదు. ఉద్యోగం మానుకుంటావా ఏం?" అని అడిగాడు.

"నన్ను పాడుకోవద్దంటిరిగా? పాడకుండా నాకు పని సాగదు. నన్ను పంపెయ్యండి. పాడుకుంటూ పని చేసే చోట కుదురుకుంటాను." అన్నాడు భూపతి.

రెడ్డిగారు నవ్వి, "మరి నీ పెళ్ళాం నీలాటి మనిషి కాదుట్రా? అది పని చెయ్యనన్నదా? దానిచేత పాటలు రాయటం ఎందుకు మాన్పించావు? కళాభిమానాన్ని అలా అణచిపెట్టితే అది నీలాగా బాధపడదూ? దాని బాధ నా భార్య గ్రహించి, నీకు కాస్త బుద్ధి చెప్పమన్నది. అంతకన్న ఏమీలేదు. సంగతేమిటో అర్థమయిందికదా? యిక వెళ్ళి పనిచూసుకో, పాడుకో. నీ భార్యను పనిచేసుకోవటంతో బాటు పాటలు కూడా రాసుకోనీ!" అన్నాడు.





# ముసలిదాని సహాయం

ఒక అడవిప్రదేశంలో ఒక ముసలిదాని గుడిసె ఉండేది. ఆ దారిన ప్రయాణించే వాళ్ళు ఆ ప్రాంతం చేరేసరికి చీకటి పడితే, ఆ రాత్రి ముసలిదాని ఇంట తలదాచుకుని, తెల్లవారి ముందుకు సాగి పోయేవాళ్ళు.

ఎందుకంటే అడవిలో దొంగల భయం కూడా ఉండేది. దొంగలు కూడా తాము దొంగిలించిన ధనం తాత్కాలికంగా ముసలిదాని దగ్గిర దాచబెట్టి, అందులో కొంత ఆమెకు ఇస్తూండేవారు.

ఒకరోజు సాయంకాలం ఒక దొంగ ముసలిదాని ఇంటికి వచ్చి, ఆమెకు ఒక ముత్యాలహారం తీసి చూపి, "ఇది నీ దగ్గిర దాచి ఉంచి, నేను అడిగి నప్పుడు ఇయ్యి. ఇది ఒక జమీందారుది. జమీందారు కొడుకు ఈ రాత్రి ఇటుగా గుర్రం మీద వచ్చి, రాత్రికి నీ యింట బస చేస్తాడు. అతని గుర్రాన్ని నీ యింటి ముందున్న చెట్టుకు కట్టివేస్తాడు. నేను ఒక రాత్రివేళ వచ్చి, ఈ హారాన్ని నీ వద్ద తీసుకుని, ఇందులో సగం నీ కిచ్చి, మిగిలిన ముత్యాలతో సహా ఆ గుర్రం మీద వెళ్ళిపోతాను. జమీందారు కొడుకు తెల్లవారి లేచి, తన గుర్రాన్ని ఎవరో ఎత్తుకుపోయారనుకుంటాడు. నీ మీద అతడికి ఎటువంటి అనుమానమూ రాదు," అన్నాడు.

ఈ ఏర్పాటుకు ముసలిది ఒప్పుకుని, దొంగ చూస్తూండగానే ఉట్టి మీద ఉన్న మూడు కుండల్లో పైదానిలో ఆ హారాన్ని పెట్టింది.

దొంగ వెళ్ళిపోయాడు.

దొంగ చెప్పినట్టే, చీకటిపడే వేళకు జమీందారు కొడుకు గుర్రం మీద వచ్చి, ఆ రాత్రికి ముసలిదాని ఇంట ఉంటా

చాగంటి విశ్వనాథరావు

నన్నాడు. ముసలిది సరేనన్నది. జమీం దారు కొడుకు తన గుర్రాన్ని తీసుకుపోయి ముసలిదాని ఇంటి ముందున్న చెట్టుకు కట్టేశాడు.

అతను నిద్రపోయాడని రూఢి కాగానే ముసలిది, దొంగ కోసం నిరీక్షిస్తూ, చెట్టు కిందవున్న గుర్రం కనిపించేలాగా కిటికీ దగ్గిర కూర్చున్నది.

దొంగ రానేలేదు. తెల్లవార వస్తున్నది. ఇక దొంగ రాడనుకుని ముసలిది, ముత్యాలహారం తనకే ఉంచుకోవాలన్న దుర్బుద్ధితో, ఉట్టి మీద ఉన్న పై కుండలో చెయ్యి పెట్టింది.

అందులో ముత్యాల హారం లేదు. వెంటనే ముసలిదానికి గుండె ఆగినంత పని అయింది.

వెనకనుంచి పెద్ద నవ్వు వినిపించే సరికి, ముసలిది ఉలిక్కిపడి వెనక్కు చూసింది. ఆమెకు జమీందారు కొడుకు కనిపించాడు. ముత్యాలహారం అతని చేతిలో ఉన్నది.

"ముసలమ్మా, ఈ హారం మా వంశంలో చాలా కాలంగా ఉంటున్నది. ఇలాటి ముత్యాలు ఒకంతట దొరకవు. వీటి వెల చాలా ఉంటుంది. నేను మా జమీం దారీ గ్రామం విడిచి, పట్నంలో స్థిరపడ బోతున్నాను. నేను ఈ ప్రాంతం చేరే సరికి సూర్యాస్తమయం కావస్తున్నది. చీకటిపడి అరణ్యంలో చిక్కుకోవటం నాకూ, ఈ హారానికీ కూడా ప్రమాదం. అందుచేత ఈ రాత్రి నీ ఇంట గడిపి, తెల్లవారినాక బయలుదేరదలిచాను. అయితే రాత్రి ఈ హారాన్నీ, నా గుర్రాన్నీ ఎవరు కాపలా కాస్తారన్న సమస్య వచ్చింది. ఆ రెండు పనులూ నీ చేతనే చేయించాలని నిర్ణయించి, దొంగలాగా వేషం వేసుకుని వచ్చి, నిన్ను కాస్త మోసగించాను. నాకు ఈ పాటి సహాయం చేసినందుకు బహుమానం పుచ్చుకో,'' అని, జమీందారు కొడుకు ఆమెకు కొంత డబ్బు ఇచ్చి, గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు.



# గొర్రెపొటేలు బేరం

సోమయ్యకు గొర్రెలమందలు చాలా ఉండేవి. అతను మంచివాడేగాక, అమాయకుడు కూడా.

సమీప గ్రామంలో ఉండే పేరయ్య అనేవాడు జబ్బుపడి నీరసించి, కోలుకోవటానికి మాంసం తినాలనుకుని సోమయ్య వద్దకు వచ్చి, తాను జబ్బుపడి నీరసించిన సంగతి చెప్పుకున్నాడు. సోమయ్య జాలిపడి పేరయ్య చేతిలో పది రూపాయలు పెట్టాడు.

పేరయ్య కొంతదూరం పోయి తిరిగివచ్చి, "అన్నా, ఈ పది రూపాయలు నువే ఉంచుకుని చిన్న గొర్రెపొటేలు పిల్లను ఇయ్యి," అన్నాడు. సోమయ్య ఆ పది రూపాయలు తీసుకుని ఒక పిల్ల పొటేలును పేరయ్య కిచ్చాడు.

పేరయ్య కొంతదూరంపోయి తిరిగివచ్చి, "అన్నా, ఆ పది రూపాయలూ, ఈ పొటేలు పిల్లా నువే ఉంచుకుని, నాకు ఇంకొంచెం పెద్ద పొటేలును ఇయ్యి," అన్నాడు. అమాయకుడైన సోమయ్య అలాగే చేశాడు.

ఈ విధంగా రెండుమూడుసార్లు చేసి, పేరయ్య సోమయ్య మందలోకెల్లా పెద్ద పొటేలును పట్టుకుపోయాడు.

పాపం, సోమయ్య చాలా మంచి లాభసాటి బేరం చేశాననుకున్నాడు!

—ఎం. వీరారెడ్డి






# దైవభీతి - రాజభక్తి

ఇరాన్‌దేశం లోని ఒక గ్రామంలో ఇబ్రహీం, ఇస్మాయిల్ అనే ఇద్దరు కట్టెలు అమ్ముకునేవారు ఉండేవారు. వాళ్ళు రోజూ అడవికి పోయి, కట్టెలు కొట్టి, సమీపంలో ఉన్న నగరానికి పోయి అమ్ముకుని, ఆ చాలీచాలని డబ్బుతో తమ పెద్ద సంసారాలు గడుపుతూ, తాము ఏ విధంగానైనా ధనవంతులమై పోతే బాగుండుననుకునేవారు.

అయితే ఇబ్రహీం దైవభీతి, రాజభక్తి కలవాడు కావటంచేత, దైవానికీ, రాజుకూ సమ్మతమయేలాగా తాను ధనవంతుడు కావాలని కోరుకునేవాడు. ఇస్మాయిల్‌కు ఇలాటి పట్టింపు లేదు. దైవంగాని, రాజు గాని తన దారిద్ర్యాన్ని తొలగించరు గనక, తాను ధనవంతుడు కావటానికి వారి సమ్మతి అవసరం లేదని అతని ఉద్దేశం.

ఒకరోజు అడవిలో వాళ్ళిద్దరూ చెరొక పక్కా కట్టెలు కొట్టుతున్నారు. ఉన్నట్టుండి ఇస్మాయిల్‌కు ఒక ఆలోచన వచ్చింది. అతను ఇబ్రహీం దగ్గరికి వచ్చి, "చూడు, ఇబ్రహీం! అడవులలో నిధి నిక్షేపాలుంటాయంటారు. మనకు అటువంటిది ఒకటి దొరికిపోతే ఎంత బాగుంటుంది!" అన్నాడు.

"దొరికితే ఏం లాభం? అది మనకు చెందదు కదా! నిధి నిక్షేపాలు ప్రజలందరి సొత్తూ కనక అవి పాదుషాకు చెందటం సంప్రదాయం," అన్నాడు ఇబ్రహీం.

"నీ సంప్రదాయం తగలబడా!" అని శాపనార్థాలు పెట్టి, ఇస్మాయిల్ తన పని చూసుకోబోయాడు.

మర్నాడు ఇద్దరూ అడవిలో కట్టెలు కొట్టేటప్పుడు ఇబ్రహీంకు ఒక మొద్దు

అన్వర్

దొరికింది. అతను దాన్ని కష్టపడి రెండుగా గొడ్డలితో నరికేసరికి అతనికి ఆశ్చర్యమూ, భయమూ కూడా కలిగాయి. ఎందుకంటే ఆ మొద్దు లోపల ఒక బంగారు పాత్ర ఉన్నది. మూత తీసి చూస్తే పాత్రనిండా బంగారు దీనారాలున్నాయి.

అతను వెంటనే ఇస్మాయిల్ ఉన్న చోటికి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. ఇబ్రహీంను చూసి ఇస్మాయిల్ కంగారుపడ్డట్టు కనిపించాడు. కాని, తనకు బంగారం దొరికిందని ఇబ్రహీం చెప్పినాక ఆశ్చర్యపడి, "దాన్ని ఏం చెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"ఏముందీ? తీసుకుపోయి పాదుషా గారికి ఇచ్చేస్తాను. ఆయన ఏమైనా ఇస్తే తీసుకుంటాను." అన్నాడు ఇబ్రహీం.

"ఓరి దౌర్భాగ్యుడా! అయితే నీకు మంచి కాలం రాదు పో." అన్నాడు ఇస్మాయిల్.

"మంచికాలం వచ్చేమాటుంటే నన్ను వెతుక్కుంటూ అదే వస్తుంది." అన్నాడు ఇబ్రహీం.

డబ్బు కోసం అంతగా విలవిలలాడే ఇస్మాయిల్ తనకు దొరికిన బంగారాన్ని చూడటానికైనా రాకపోవటం ఇబ్రహీంకు ఆశ్చర్యంగానే తోచింది. అతను బిందెను తీసి ఒక పక్కన పెట్టి, మొద్దును నరికి



కట్టెలుచేసి, బంగారు పాత్రను కట్టెల మధ్య కనబడకుండా పెట్టి మోపుకట్టి, ఇంటికి వెళ్ళి కట్టెలు అక్కడ పడేసి, బంగారు పాత్రను రాజధానికి తీసుకుపోయి పాదుషా పాదాలదగ్గిర పెట్టి అది తనకు ఎలా దొరికినదీ చెప్పుకున్నాడు.

పాదుషా నిండు దర్బారులో అతని రాజభక్తిని మెచ్చుకుని, ఆ పాత్రను స్వీకరించి, ఇబ్రహీంకు బహుమానంగా పాత్రలోని దీనారాలివ్వక, ఖజానా నుంచి నూరు దీనారాలు తెప్పించి ఇచ్చి, అతన్ని పంపేశాడు.

ఇబ్రహీం వెంటనే ఆ డబ్బుతో చిన్న వ్యాపారం ప్రారంభించాడు.

ఇది జరిగిన రెండు రోజుల తరవాత, ఇస్మాయిల్ నకిలీ బంగారాన్ని మేలిమి బంగారమని చెప్పి, రాజధాని నగరంలో అమ్మజూపుతూ రాజభటులకు దొరికి పోయాడన్న వార్త ఇబ్రహీం ఉండే గ్రామంలో తెలిసింది. ఇబ్రహీం వెంటనే రాజధానికి వెళ్ళాడు.

ఇస్మాయిల్ పాదుషాగారి విచారణ ఎదురు చూస్తూ నిర్బంధంలో ఉన్నాడు. ఇబ్రహీం పాదుషాను కలుసుకుని, ఇస్మాయిల్‌కు తాను జామీను ఉంటాననీ, అతన్ని వదిలిపెట్టవలసిందనీ కోరాడు. పాదుషా ఇబ్రహీం అభ్యర్థన విని, సభికులతో ఇలా చెప్పాడు:

''దైవభీతీ, రాజభక్తీ కలిగి సంప్రదాయ బద్ధంగా జీవించేవారు సుఖంగా ఉండగలరు. వీటిని వ్యతిరేకించిన వారు కష్టాలపాలవుతారు. ఇందుకు ఒక చిన్న కథ చెబుతాను. ఇద్దరు కట్టెలమ్మి జీవించేవారుండేవారు. వారిలో ఒకడు దైవభీతీ, రాజభక్తీ కలవాడు. ఒకరోజు షికారుగా అడవికి పోయిన పాదుషా వారి సంభాషణ విని, రెండు నకిలీ బంగారపు పాత్రలను వారు కట్టెలు కొట్టే చోట పూడ్పించాడు. అవి వారిద్దరికీ దొరికాయి. మొదటివాడు తన బంగారపు పాత్రను సంప్రదాయం ప్రకారం పాదుషాకు అప్పగించి, నూరు దీనారాలు బహుమతి పొందాడు. రెండోవాడు అంతా తనకే కావాలని దురాశపడి, సంప్రదాయ విరుద్ధంగా ఆ నకిలీ బంగారాన్ని అమ్మబోయి దొరికిపోయాడు. మొదటివాడు ఇబ్రహీం, రెండోవాడు ఇస్మాయిల్.''

ఇలా చెప్పి పాదుషా ఆ ఇద్దరినీ సభికులకు చూపాడు.

ఇబ్రహీం జామీనుపైనా, అతని కోరిక ప్రకారమూ ఇస్మాయిల్‌ను పాదుషా వదిలిపెట్టాడు. ఇస్మాయిల్‌కు బుద్ధి వచ్చి, చెంపలు వేసుకున్నాడు. ఇబ్రహీం అతన్ని తన వ్యాపారంలో భాగస్వామిగా చేసుకున్నాడు. కాలక్రమాన ఇద్దరూ పెద్ద వ్యాపారస్తులయారు.





# గుణపాఠం

ఆ దేశంలో పంటలు సమృద్ధిగా పండినప్పటికీ, ఆహారపదార్థాల ధరలు నానాటికీ పెరిగిపోయి, జనంలో హాహాకారాలు బయలుదేరాయి.

నానాటికీ దేశపరిస్థితి క్షీణించి పోతూండడం చూసి ప్రచండసేన మహారాజు ప్రజలకు ఖజానా నుంచి ద్రవ్య సహాయం చేశాడు. ఖజానా సగం ఖాళీ అయినా పరిస్థితి మెరుగు కాకపోగా, ఎక్కువ డబ్బు చలామణీ అయి, ధరలు మరింతగా పెరిగి పోయాయి.

కరువు బాధ నుంచి ప్రజలను ఎలా కాపాడాలా అని మంత్రులతోనూ, ఇతర ఆస్థానోద్యోగులతోనూ సంప్రతించాడు. కాని ఎవరూ ఆ సమస్యకు సరి అయిన పరిష్కారం చెప్పలేక పోయారు. పురోహితులు మాత్రం, హోమాలు జరిపి దేవతలను తృప్తి చేస్తే, కరువు బాధ ఉండదన్నారు. ప్రచండసేనుడు హోమం చెయ్యమని, అందుకు కావలసిన ధనం ఇప్పించాడు.

హోమాలు నిర్విఘ్నంగా జరిగాయి. కొందరు కోళ్ళనూ, మేకలనూ గ్రామ దేవతలకు బలులు కూడా ఇచ్చారు. కాని ఆహారధాన్యాల ధరలు ఎంతమాత్రమూ తగ్గుముఖం పట్టలేదు.

ఆఖరి ప్రయత్నంగా ప్రచండసేనుడు రాజ్యంలో ఉన్న ధాన్యపు వర్తకులను పిలిపించి, ధాన్యపు ధరలు తగ్గించమని అడిగాడు.

వర్తకులు రాజుతో, ''ప్రభూ, మన రాజ్యంలో చాలినన్ని తిండిగింజలు లేకనే గదా ఇలాటి పరిస్థితి ఏర్పడింది? ఎక్కువ ధరకు కొన్న సరుకు తక్కువ ధరకు మేం మాత్రం ఎలా అమ్మగలం?'' అన్నారు.

గుండాల విజయ

వర్తకులు చెప్పిన ఈ మాటను ప్రచండ సేనుడు నమ్మలేదు. దేశంలో ఎక్కడా పంటలు పాడైనట్టు వార్త రాలేదు. తిండి గింజలు చాలకుండా ఎందుకుపోవాలి? వర్తకులు ధాన్యం దాచి ఇలా నాటకం ఆడుతున్నారని రాజుకు అనుమానం కలిగింది. అందుచేత ఆయన ఆహార ధాన్యాలకు న్యాయమైనధరలు నిర్ణయించి అంతకన్న హెచ్చు ధరలు అడిగిన వారిని కఠినంగా శిక్షిస్తానని వర్తకులను హెచ్చరించాడు.

వెంటనే పెద్దవర్తకులందరూ తమ దుకాణాలు మూసివేశారు. జరిగే అమ్మకాలు రహస్యంగా దొడ్డిదారిన జరుగుతున్నాయి.

ఈ పరిస్థితిలో, దేశాటనకు వెళ్ళి ఉండిన మంత్రికుమారుడు రవివర్మ స్వదేశానికి తిరిగివచ్చాడు. దేశం ఎంతటి దీనస్థితిలో ఉన్నదీ అతను తెలుసుకోవటమేగాక, పరిస్థితి చక్కబరచటానికి ఏం చెయ్యాలో కూడా అతనికి తట్టింది. అతను తన ఆలోచనను ప్రచండసేనుడికి తెలిపాడు. ప్రచండసేనుడు ఆ పథకాన్ని ఆమోదించాడు.

ఆహారధాన్యాలను పొరుగు దేశాల నుంచి తెప్పిస్తున్నట్టు ఆయన ప్రకటించాడు. ఇంక కరువు ఉండదని ప్రజలకు తెలుపబడింది.

మర్నాడు తెల్లవారకముందే బళ్ళ మీద బస్తాలు దిగటం ఆరంభమయింది. ధాన్యపు వర్తకులకు కంపరం పుట్టుకొచ్చింది. వాళ్ళు దాచి ఉంచిన ఆహార ధాన్యం ఎలా చెల్లుబడి అయేటట్టు? అత్యాశకుపోయి లాభంలేదని, వాళ్ళు వెంటనే తమ దుకాణాలుతెరిచి, ధాన్యం ధరలు తగ్గించేసి, అమ్మకాలు చురుకుగా సాగించారు.

కరువు మాయమయింది. అందరికీ చౌకగా తిండిగింజలు కోరినంతగా దొరికాయి. రవివర్మ తెప్పించిన ఊకబస్తాలు రాజప్రాంగణంలో భద్రంగా ఉంచబడ్డాయి.





# వీర హనుమాన్

హనుమంతుడు ఓషధుల కోసం వెతకటం మొదలుపెట్టేసరికి వాటి జాడ తెలియ లేదు. అన్ని మొక్కలూ ఒకలాగే ఉన్నాయి. హనుమంతుడు మండిపడి, పర్వతశిఖరాన్ని పెల్లగించి, దాన్ని తీసుకుని బయలుదేరాడు.

పెద్ద కొండతో తిరిగి వస్తున్న హనుమంతుణ్ణి చూసి వానరులు సంతోషంతో గర్జించారు. అది విని హనుమంతుడు కూడా గర్జించాడు. అతను కిందికి దిగి, వానరులలో పెద్దలకు నమస్కరించి, విభీషణుణ్ణి కౌగలించుకున్నాడు.

ఓషధుల మీదుగా వచ్చే గాలి పీల్చి రామ, లక్ష్మణులు స్వస్తత చెందారు. వానరులు కూడా మూర్ఛ తెలిసి, లేచారు. చచ్చిపడిపోయిన వానరులు ఓషధుల వాసన తగలగానే బతికి లేచారు. వారి శరీరబాధలన్నీ పోయాయి.

అలాగే అనేకమంది రాక్షసులు కూడా బతికి ఉండేవారేమో, కాని యుద్ధంలో చచ్చిపోయిన రాక్షసులందరినీ రావణుడు రహస్యంగా ఉండగలందులకు సముద్రంలో పడేయించాడు.

ఓషధులతో పని తీరిపోగానే హనుమంతుడు ఓషధీపర్వతాన్ని యథాస్థానంలో ఉంచి, రామ, లక్ష్మణుల వద్దకు తిరిగివచ్చాడు.

తిరిగి వచ్చిన హనుమంతుడితో సుగ్రీవుడు, ''కుంభకర్ణుడు చచ్చాడు, రావణుడి కొడుకులూ చచ్చారు. అందు

**28. ఇంద్రజిత్తు హోమం**



చేత రావణుడు ఇప్పుడు యుద్ధానికి రాడు. ఈ రాత్రికి బలవంతులైన వానరులు దివిటీలు తీసుకుని లంకకు వెళ్ళాలి,'' అన్నాడు.

సూర్యాస్తమానమై. చీకటి పడగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంకకు బయలుదేరారు. ద్వారాల వద్ద కాపలా ఉన్న రాక్షసులు వానరులకు బెదిరి పారిపోయారు. వానరులు, తమను అడ్డేవారు లేక, నగరద్వారాలకూ, బురుజులకూ, వీధులలోనూ, ఇళ్ళకూ నిప్పు పెట్టేశారు. ఇళ్ళు అసంఖ్యాకంగా తగలబడ్డాయి. ఇళ్ళతోబాటు ఇళ్ళలో ఉండే అమూల్యమైన వస్తువులు కూడా తగలబడ్డాయి. చాలామంది రాక్షసులు కూడా మంటలలో చచ్చారు. వానరుల హర్ష ధ్వానాలూ, రాక్షసుల ఆర్తనాదాలూ మిన్నుముట్టాయి.

రాక్షసులు ఈ పరిస్థితిలో యుద్ధానికి సిద్ధపడ్డారు. కాని ఈసారి వాళ్ళు వానరులను లంకానగరంలోనే ఎదుర్కోవలసి వచ్చింది.

''మీరు రావణుడి మందిరం సమీపంలో రాక్షసులతో యుద్ధం చెయ్యండి,'' అని సుగ్రీవుడు వానరులకు ఆజ్ఞ ఇచ్చాడు. అతని ఆజ్ఞ ప్రకారం దివిటీలు పట్టుకున్న వానరులు తన మందిర ద్వారాల వద్ద నిలబడి ఉండటం చూసి రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను కుంభకర్ణుడి కొడుకులైన కుంభ, నికుంభులను వానరుల మీద యుద్ధానికి పంపాడు. కుంభ, నికుంభుల వెంట యూపాక్షుడూ, శోణితాక్షుడూ, ప్రజంఘుడూ, కంపనుడూ కూడా వెళ్ళారు.

ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అంగదుడు కంపనుణ్ణి చంపాడు. తరవాత అతను శోణితాక్షుడి ఖడ్గం లాగేసుకుని, దానితోనే అతన్ని చంపి, ఇతర రాక్షసుల మీదికి వెళ్ళాడు. అతని చేతిలో ప్రజంఘుడూ చచ్చాడు. యూపాక్షుడు మైందుడి చేతిలో చచ్చాడు.

కుంభుడితో యుద్ధంచేస్తూ అంగదుడు మూర్ఛపోయాడు. అదితెలిసి రాముడు అంగదుడికి తోడుగా జాంబవంతుడు మొదలైనవారిని పంపాడు. కాని వాళ్ళు కుంభుడి బాణాలను ఎదుర్కొని, అతన్ని సమీపించలేకపోయారు. అదిచూసి సుగ్రీవుడు కుంభుడి బాణాలను సహిస్తూ, అతన్ని సమీపించి, అతని ధనుస్సును విరిచి, అతనితో కలియబడి యుద్ధం చేశాడు. ఆ మల్లయుద్ధంలో చివరకు కుంభుడు చచ్చాడు.

తన అన్న చచ్చినందుకు ఆగ్రహించి నికుంభుడు పరిఘ నొకదాన్ని గిరగిరా తిప్పి, ఎదురుగాకనిపించిన హనుమంతుడి రొమ్ము కేసి విసిరాడు. అది హనుమంతుడి రొమ్ముకు తగిలి, ముక్కలై కిందపడింది. కాని హనుమంతుడు మంచిదెబ్బతిన్నాడు. ఆ కోపంతో అతను పిడికిలిబిగించి, నికుంభుడి రొమ్ములో బలంకొద్దీ పొడిచాడు.

ఆ దెబ్బకు నికుంభుడు నెత్తురు కార్చుకుని, మూర్ఛపోయి, తిరిగి లేచి హనుమంతుడితో కలియబడ్డాడు. హనుమంతుడు ఉగ్రుడైపోయి, నికుంభుడి గొంతు పట్టుకుని గిరగిరా తిప్పి, అతని తల విరిచి చంపాడు.

కుంభ, నికుంభులు చచ్చినందుకు ఏడ్చి, రావణుడు యుద్ధానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి పంపాడు. మకరాక్షుడు రాముడితో యుద్ధం చేసి, చచ్చాడు.



ఈ వార్త అందగానే రావణుడు కోపంతో పళ్ళుకొరికి, ఇంద్రజిత్తును యుద్ధానికి వెళ్ళమన్నాడు. ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికి యాగభూమికి వెళ్ళాడు. అతనిరాక చూసి, అక్కడ ఉండే రాక్షస స్త్రీలు ఋత్విజులు ధరించటానికి ఎర్ర తలగుడ్డలు తెచ్చారు.

ఇంద్రజిత్తు చేసిన హోమం అతి చిత్రమైనది. అతను దర్భలకు బదులు తన ఆయుధాలూ, సమిధలకు తాండ్ర పుల్లలూ, స్రుక్, స్రువాలుగా ఇనుప పాత్రలూ వాడాడు. అతని ఋత్విజులు



ఎర్రబట్టలు కట్టుకున్నారు. హోమం కోసం అతను నల్లమేక కంఠం నరికాడు. విజయ సూచకంగా అగ్ని పొగలేకుండా మండింది. ఈవిధంగా ఇంద్రజిత్తు అగ్నిలో హోమం చేసి, దేవ, దానవ, రాక్షసులకు తర్పణాలిచ్చి, మాయమయేశక్తి గల తన రథాన్ని ఎక్కాడు. ఆ రథం సూర్యుడిలాగా వెలిగిపోతున్నది.

ఇంద్రజిత్తు అంతర్ధానమై యుద్ధరంగానికి వచ్చాడు. అతను వానరసేన మధ్య రామ, లక్ష్మణులను గుర్తించి, వారి మీద బాణవర్షం కురిపించాడు. రామ, లక్ష్మణులు తమ బాణాలతో ఆకాశమంతా కప్పినా, అవి ఇంద్రజిత్తుకు తగలలేదు. అతని బాణాలు రాముడి అన్ని అవయవాలనూ గాయపరిచాయి. రామ లక్ష్మణులు తమ బాణాలతో ఇంద్రజిత్తు బాణాలను చాలావరకు ఖండించారు. అతని బాణాలు వానరసేనలో అమితమైన నష్టాన్ని కలిగిస్తున్నాయి.

లక్ష్మణుడికి చాలాకోపం వచ్చి, "నేను బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసులనందరినీ చంపేస్తాను," అని రాముడితో అన్నాడు.

రాముడు అందుకు ఒప్పుకోక, "ఒక్కడి కోసం భూమి మీద ఉండే రాక్షసులనందరినీ చంపుతాననటం భావ్యంకాదు. మనం ఇంద్రజిత్తును మాత్రమే చంపే ప్రయత్నంచేతాం. దివ్యాస్త్రాలను ప్రయోగింతాం," అన్నాడు.

ఇంతలో ఇంద్రజిత్తుకు ఏదో ఆలోచన వచ్చింది. అతను యుద్ధభూమి నుంచి లంకానగరంలోకి తిరిగివెళ్ళి, మాయా సీతను రథం మీద ఉంచుకుని యుద్ధభూమికి మళ్ళీ వచ్చాడు. ఆ మాయా సీతను రామ, లక్ష్మణులు చూస్తూండగా చంపి, వారికి మనోదౌర్బల్యం కలిగించాలని అతని ఉద్దేశం.

ఇంద్రజిత్తు యుద్ధభూమికి తిరిగి రావటం చూసి హనుమంతుడు గొప్ప శిలను చేతబట్టుకుని అతని కేసి వచ్చాడు. అతని వెనకగా అనేకమంది వానరవీరులు

శిలలు చేతబట్టి వచ్చారు. అయితే హనుమంతుడికి ఇంద్రజిత్తు రథం మీద ఏడుస్తూ, కృశించిపోయిన సీత కన బడింది. అది చూసి హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను మిగిలిన వానరులను, "ఇంద్రజిత్తు తన రథం మీద సీతాదేవిని ఎందుకు తెచ్చి ఉంటాడు?" అని అడిగాడు.

తరవాత అతను ఆవేశంతో ఇంద్రజిత్తు మీదికి వెళ్ళాడు. వానరసేన తన మీదికి వస్తూండటం చూసి, ఇంద్రజిత్తు తన కత్తితో మాయ సీత మెడ మీద రాచాడు, ఆమెను కొట్టి, జుట్టు పట్టుకున్నాడు.



హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను ఇంద్రజిత్తుతో, ''దుర్మార్గుడా, పాపీ! నువు చేసేపని ఏం పని? ఇలా చెయ్యటానికి నీకు సిగ్గు కూడా లేదా? నువు సీతను చంపావే, త్వరలోనే నువూ చస్తావు. నీ కెంత బలం ఉన్నా సరే! నా చేతికి చిక్కావు. నిన్ను ప్రాణాలతో వదలను,'' అన్నాడు.

ఇంద్రజిత్తు మీదికి వచ్చిన వానర సేనను రాక్షససేన ఎదిరించింది. ఇంద్ర జిత్తు హనుమంతుడితో, ''ఈ సీత కోసమే గదా నువూ, సుగ్రీవుడూ, రాముడూ లంకకు వచ్చారు? ఆమెను నీ కళ్ళ ఎదటే చంపేస్తాను. తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ద్రోహి అయిన విభీషణుణ్ణీ చంపేస్తాను. స్త్రీలను చంపరాదంటున్నావుగాని, శత్రువుకు బాధ కలిగించేది ఏదైనా చెయ్యవచ్చు,'' అన్నాడు.

ఇలా అని, ఏడుస్తున్న మాయ సీతను తన ఖడ్గంతో ఇంద్రజిత్తు నరికాడు. తరవాత అతను వికృతంగా సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి బెదిరి వానరులు పారిపోయారు.

హనుమంతుడు వారిని వారిస్తూ, ''మీ ప్రతాపమూ, కార్య శూరత్వమూ ఏమయింది? శూరులు యుద్ధం నుంచి పారిపోతారా?'' అని వారిని వెనక్కు



మళ్ళించాడు. ఆ వానర వీరులను వెంట వేసుకుని హనుమంతుడు రాక్షసుల పాలిటి యముడై మహా యుద్ధం చేశాడు.

అతను ఇంద్రజిత్తు రథం మీద బ్రహ్మాండమైన శిలను విసిరాడు. ఇంద్రజిత్తు సారథి యుక్తిగా రథాన్ని తప్పించాడు గాని, దానికిందపడి చాలామంది రాక్షసులు చచ్చారు. రాక్షసులను వానరులు విజృంభించి చంపసాగారు. వాళ్ళు ఇంద్రజిత్తు మీద శిలల వర్షం కురిపించారు. ఇంద్రజిత్తు కోపించి, తన బాణాలతో వానరులను చంపసాగాడు. రాక్షసులకు ఉత్సాహం వచ్చింది.

అయితే హనుమంతుడు రాక్షససేనను తరిమికొట్టి, తన వారితో, "ఈ రాక్షససేనతో మనకేమిటి? మనం సీత కోసం వచ్చాం. సీత చచ్చిపోయింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వాళ్లు ఏం చెయ్యమంటే అది చేద్దాం, పదండి," అన్నాడు.

హనుమంతుడు తిరిగిపోవటం చూసి, ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికని నికుంభిళ చైత్యానికి వెళ్ళాడు. అక్కడ అతను అగ్నిలో మాంసమూ, రక్తమూ హోమం చేశాడు.

ఈ లోపల రాముడు వానరులకూ, రాక్షసులకూ కోలాహలంగా యుద్ధం సాగుతూండటం గ్రహించి, అది హనుమంతుడు చేస్తున్న యుద్ధం అయి ఉండాలని జాంబవంతుడితో అన్నాడు. రాముడు ఆజ్ఞాపించిన మీదట జాంబవంతుడు హనుమంతుడికి సహాయంగా పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

హనుమంతుడు తన కోసం వచ్చే భల్లూక సేనను చూసి, వారిని వెనక్కు రమ్మన్నాడు. అందరూ రాముణ్ణి చేరుకున్నారు. హనుమంతుడు దుఃఖంతో రాముడికి సీతను ఇంద్రజిత్తు చంపిన సంగతి చెప్పాడు. ఈ వార్త వింటూనే రాముడు కుప్పకూలిపోయాడు. అది

చూసి ఎక్కడెక్కడో ఉన్న వానర ప్రముఖులందరూ రాముడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళు రాముడి ముఖం మీద సుగంధ జలం చల్లారు.

లక్ష్మణుడు రాముణ్ణి కౌగలించుకుని ఇలా అన్నాడు: "నువు ధర్మమార్గం అవలంబించి పితృవాక్య పరిపాలన చేశావు; రాజ్యాన్ని వదులుకున్నావు; కైకేయీ దశరథుల మీద ఎలాటి కక్ష పెట్టుకోలేదు. కాని నీకే అన్నిరకాల కష్టాలూ వస్తున్నాయి. నీ ధర్మం నిన్ను కాపాడకుండా ఉన్నది. ఈ ధర్మం నిష్ప్రయోజనం అనుకోవలసి ఉన్నది. ఇది అసత్యమైనది. అధర్మం అవలంబించిన రావణుడు మాత్రం సుఖంగానే ఉన్నాడు," అంటూ అతన్ని ఊరడించ యత్నించాడు.

అప్పుడు విభీషణుడు వారున్నచోటికి వచ్చి, రామలక్ష్మణుల దుఃఖం చూసి, సీతను ఇంద్రజిత్తు వధించాడన్న వార్త విన్నమీదట ఇలా అన్నాడు: "రాముడా, ఈ వార్త నమ్మదగినది కాదు. సీతను నీకు ఇయ్యమంటే వినని రావణుడు సీతను వధించటానికి సమ్మతిస్తాడా? అతను ఆమెను ఏ పరిస్థితిలోనూ వదులుకోవటానికి ఇష్టపడడు. ఇంద్రజిత్తు హోమం చేస్తున్నాడు. ఆ సమయంలో వానరులు తన హోమానికి విఘ్నం కలిగించిపోతారని, వాళ్ళను దుఃఖంలో ముంచి ఉంచటానికి మాయ సీతను వధించి పోయి ఉంటాడు. అతను నిర్విఘ్నంగా హోమం చేసి వచ్చాడంటే, దేవతలందరూ ఏకమై వచ్చినా అతన్ని జయించలేరు. అందుచేత, ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే మనం నికుంభిళకు సైన్యంతో పోదాం. నువు నిశ్చింతగా ఇక్కడే ఉండు. మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు హోమానికి విఘ్నం కలిగించటమేగాక, అతనితో యుద్ధం చేసి చంపి, బ్రహ్మవరం నిజం చేస్తాడు."






తూర్పు తీరాన కుజంగ్ అనే చిన్న రాజ్యం ఉండేది. ప్రదీప్ దాని రాజధాని. దాన్ని పాలించిన రాజులు శౌర్యపరాక్రమాలు గలిగి, వృషభరాజులు అని పేరు పడ్డారు. అక్కడి ప్రజలు సముద్రం మీదా, మహానది మీదా ఎదురులేనివారు. రాజా చంద్రధ్వజుడికి వీరవృషభుడని పేరు.




బ్రిటిషువాళ్ళు క్రమంగా భారతదేశాన్ని ఆక్రమించుకుంటూ వచ్చి, ఈ చిన్న రాజ్యాన్ని జయించటానికి చాలా శ్రమ పడ్డారు. చంద్రధ్వజుడి నాయకత్వంలో కుజంగ్ నావికులు, సముద్రతీరాన లంగరు దించి ఉంచిన బ్రిటిషు నౌకలను చాలా పీడించారు.



బ్రిటిషు సేనలు కుజంగ్‌ను ముట్టడించాయి. చంద్రధ్వజుడి సైనికులకు శ్రేష్ఠమైన ఆయుధాలు లేనప్పటికీ, వీరోచితంగా పోరాడారు. చివరకు కోట బ్రిటిషువారి వశమయింది.



61



అయితే చంద్రధ్వజుడు పట్టుబడలేదు. కొద్దిమంది అంగరక్షకులతో అతను, సముద్రతీరం వెంబడి ఉన్న కీకారణ్యంలోకి పారిపోయాడు.



బ్రిటిషువారు కుజంగ్‌ను గెలిచారన్న మాటే గాని, ఆ ప్రాంతంలో ఉండటమే వారికి కష్టమయింది. చంద్రధ్వజుడి మనుషులు అవకాశం దొరికినప్పుడల్లా వారి శిబిరాలకు అగ్గి పెట్టి, వారి మీద దాడి చేశారు.



చంద్రధ్వజుణ్ణి పట్టుకుంటేతప్ప తమకు శాంతి ఉండదని బ్రిటిషువారికి తెలిసిపోయింది. ఒకనాడు అరణ్యంలో చంద్రధ్వజుడు ఒంటరిగా ధ్యానసమాధిలో ఉండగా, వేగులవాళ్ళ సహాయంతో బ్రిటిషువాళ్ళు అతన్ని పట్టుకున్నారు.



ఖైదీని కటకానికి తెచ్చి, మహానదీ తీరాన బారాబతి కోటలో బంధించారు. కాని అతన్ని పట్టుకున్నవాళ్ళు అతని చుట్టూ చేరి అతను చెప్పే కథలు విని ఆనందించేవారు.



అంతేగాక అతను దొరలకు అనేక భారతీయ వ్యాయామక్రీడలు నేర్పాడు. వాటిలో అతనికి గొప్ప ప్రావీణ్యం ఉండేది. ఇలా చాలా మాసాలు గడిచాయి.



ఒకనాటి సాయంకాలం నది మీద చాలా అందమైన పడవ ఒకటి కనిపించింది. అందులో తెడ్లు వేసేవాళ్ళు 36 మంది ఉన్నారు. ఆ పడవను చూసి దొరలూ, దొరసానులూ, వారి పిల్లలూ ఎంతో ముచ్చటపడ్డారు. అలాటి పడవను వారెన్నడూ చూడలేదు.



నరంగును ప్రశ్నించగా, ఆ పడవ ఒక రాజుదనీ, అతను పోయాడనీ, అది అమ్మకానికి ఉన్నదనీ తెలిసింది. "ధర ఎంత?" అని దొరలు అడిగారు. "ఎవరైనా రాజే చెప్పాలి. ఇలాటి విలాస నౌకలను వారే తయారు చేయిస్తారు," అన్నాడు నరంగు.



కుతూహలంకొద్దీ దొరలు కోట నుంచి చంద్రధ్వజుణ్ణి బయటికి తెచ్చి, ఆ పడవను పరీక్షించమన్నారు. చంద్రధ్వజుడు పడవలోకి ఎక్కాడు.



వెంటనే 36 తెడ్లూ ఒక్కసారి ఆడాయి. రెప్పపాటులో పడవ నది వంపు దాటి కనిపించకుండా పోయింది. అంతా మించిపోయాక గాని దొరలకు జరిగినది అర్థంకాలేదు. చంద్రధ్వజుణ్ణి అతని ప్రజలూ, మంత్రి పట్టాజోషి తప్పించేశారు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఒక గొప్ప పిసినిగొట్టు తాను తినేవాడు కాదు, ఇతరులను దమ్మిడీ ఖర్చు చెయ్యనిచ్చేవాడు కాదు. ఆ తండ్రి మూలంగా అతని కొడుకు చాలా ఇబ్బందులు పడేవాడు. వాడు జుట్టంతా దుబ్బులాగా పెరిగి, జుట్టు కత్తిరింపించుకుంటానంటే తండ్రి అణా డబ్బులు ఇచ్చేవాడు కాదు. "వీబాసి" అని వాడి స్నేహితులు వాణ్ణి ఎద్దేవా చేసేవారు.

ఒకరోజు దొడ్లో ఉన్న కొబ్బరిచెట్టు నుంచి ఒక కాయ రాలింది. అది కొడుకు కంట పడింది. వాడు దాన్ని తీసుకుని మంగలి దగ్గిరికి పోయి, "బాబ్బాబు! ఈ కొబ్బరికాయ ఇస్తాను, నాకు జుట్టు కత్తిరించు," అన్నాడు.

పిసినిగొట్టు సమాచారం మంగలికి తెలుసు గనక, వాడు కొబ్బరికాయ తీసుకుని కుర్రాడికి క్షౌరం చేసి పంపాడు. తండ్రి వాణ్ణి చూడగానే, "క్షౌరం చేయించుకున్నావు, డబ్బులెక్కడివిరా?" అని అడిగాడు. "కొబ్బరికాయ కిందపడితే అది ఇచ్చి చేయించుకున్నాను," అన్నాడు కొడుకు.

"అయ్యో, అయ్యో! అమ్మితే నిక్షేపంగా అణా డబ్బులు వచ్చేవిగదా! నా యిల్లు గుల్లయిపోతున్నదిరో దేవుడా! ఇలా అయే మాటుంటే నేను మాత్రం పొదుపు ఎందుకు చేయాలి?" అంటూ పిసినిగొట్టు, ఇరవై ఏళ్ళనుంచీ భద్రంగా పెట్టెలో దాచి ఉంచిన బూర్నీసు తీసి, "ఇవాళనుంచీ రాత్రిపూట దీన్ని కప్పుకుని పడుకోబోతే చూడు!" అని కొడుకును బెదిరించాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు జనవరి 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 మార్చి చందమామలో ప్రకటించబడతవి.

---

నవంబరు నెల పోటీ ఫలితం: భార్య తలచుకొంటే....

గెలుపొందిన వారి పేరు: జి. ఇ. జె. ప్రకాశ్, ఎస్. జి. ఎస్. కాలేజి, తిరుపతి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 మార్చినెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar

★



Nivas Jadhav

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : భర్తలు కావాలి

రెండవ ఫోటో : భక్తులు రావాలి

పంపినవారు : ఎం. ఎస్. చలం, డి. ఎమ్స్ ఆఫీసు, కొవ్వూరు. (ప.గో.జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# గిలిగింతలు పెట్టే తమాషాతో... మజా పొందండి



పన్నెండు ముగించి పదమూడవ దానికి వెళ్తున్నారా ?
దాలు, ఇప్పుడెంత షమస్య వుందో అంతుంది ముందు.
యుక్త వయస్సులో మొదలిడుతోంది సమస్య. ఆంప్రో
పదమూడవ బిస్కట్టుతో ప్రారం భిస్తోంది
తమాషా. ఈ పదమూడవ బిస్కట్ మిగిలిన
పన్నెండు బిస్కట్లలోను సమానంగా
పంచబడ్డ తృప్తికంట్టే మరెక్కువ తృప్తి
నిస్తుంది.

నేడే ఒక ఆంప్రో ప్యాకు కొని
ప్రయత్నించి చూడండి.

**ఆంప్రో®**

**గ్లూకోజ్ బిస్కట్లు**







aa/afp/6676

